Approved by the Text Book Committee of Madras.

# HIGH SCHOOL
# TELUGU GRAMMAR

# ఆంధ్రవ్యాకరణ సర్వస్వము

(REVISED EDITION)

శేషగిరి రమణకవులు.




[illegible]

ఏలూరు - మద్రాసు - గుంటూరు.




[మూల్యము 0-0-౮-0

పోష్టేజి 0- 0-0

# ఆంధ్రవ్యాకరణ సర్వస్వము

గ్రంథకర్తలు

శ్రీ శేషాద్రి రమణకవులు

శతావధానులు.

రామా అండ్ కో.,

విద్యావిషయిక ప్రచారకులు,

ఏలూరు.

బ్రాంచెస్: మద్రాసు, గుంటూరు.

౧౯౪౩



[క్రయము రు ౦-౧౩-౦

హెచ్చింపు ధర రు ౦- ౧-౦

# పీఠిక



విద్యాశాఖాధికారులు ఉన్నతపాఠశాల లందలి విద్యార్థిలోకమున కాంధ్ర భాషాప్రాముఖ్యత నభివృద్ధి యొనరింపుచు వ్యాకరణమున కొక (సెలబస్సు) ప్రణాళికను నిర్ణయించిరి. అద్దాని ననుసరించి ఈ వ్యాకరణ సర్వస్వమును రచించితిమి.

పాఠశాలలందు బండితోపాధ్యాయులు కొందఱు బాలవ్యాకరణమే బోధింపవలసియుండునని తలంచుచున్నారు. అందలి సూత్రము లభిప్రాయగర్భితములై సర్వజన సులభములుగాక విద్యార్థులకుఁ గొఱుకరాని కొయ్యలైయున్నవి. బోధకులు వాని గుప్తార్థములను వెల్లడించుపట్ల నెంతయో శ్రమపడవలసియుండును. మొదటినుండియు వ్యాకరణమనిన నెంతయో భీతినొందు విద్యార్థులపట్ల బోధకుల యీ శ్రమ యడవిఁగాఁచిన వెన్నెలయగుచున్నదని యనుభవజ్ఞులకు స్పష్టమైన విషయమే. బలవంత మాఘస్నానముగా విద్యార్థులచేఁ గొన్ని సూత్రములు వల్లెవేయించినను నయ్యవి అర్థశూన్యములు, అగమ్యగోచరములు, అనుభవదూరములునైన చిలుకపలుకులఁబోలి యుపయోగ శూన్యములుగాఁనున్నవి. కావున వ్యాకరణవిషయములు సులభగ్రాహ్యములై యనుభవైకవేద్యములై యుండుట యత్యంతావశ్యకముగదా!

నాల్గవఫారమునకు అలంకార ఛందోవిషయములుగాక తక్కిన గ్రంథమంతయును, ఐదవ ఫారమునకు అలంకార భాగముతప్ప తక్కినదంతయును, ఆఱవఫారము (S.S.L.C.) నకు గ్రంథమంతయుఁ బూర్తిగను బోధింపఁదగును.

ఉన్నత పాఠశాలలయందు మాకుఁగల చిరకాలాను భవమును బురస్కరించికొని గ్రంథమును రచించితిమి. పండితోపాధ్యాయు లిందుఁగల లోపములను దెలియఁజేసిన కృతజ్ఞతా వందనములతో మున్ముందు ముద్రణమున సవరించుకొనెదము.

ఈ వ్యాకరణ సర్వస్వమును దమ రామా కంపెనీ ప్రచురణములందుఁ జేర్చి అచిరకాలమున ముద్రించి ప్రకటించిన రామా కంపెనీ ప్రొప్రయిటరులగు మహారాజశ్రీ ఈదర వెంకయ్య పంతులువారి నభినందించుచున్నారము.

ఇట్లు విధేయులు,

శ్రీ శేషాద్రి రమణకవులు,

శతావధానులు.

# కృతజ్ఞత

అభ్యర్థించిన మాత్రమున అవ్యవధియైనను అభ్యంతరము చెప్పక యీవ్యాకరణ మాద్యంతము పరిశీలించి తగిన విధముల సంస్కరించి వెంటనే ముద్రించుట కవకాశము కలిగించి సహాయపడిన, మాపురపాల సంఘోన్నత పాఠశాలాంధ్ర పండితులగు బ్రహ్మశ్రీ ఉభయభాషా ప్రవీణ కవిశేఖర గరికపాటి మల్లావధానులుగారికి మా కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నారము.

ప్రకాశకులు

## TELUGU GRAMMAR SYLLABUS FROM THE LATEST EDUCATIONAL SYLLABUS OF HIGH SCHOOL FORMS.

### క్రొత్తగా మార్పుజెందిన హైస్కూలు ఫారముల విద్యావిధానములోని ఆంధ్రవ్యాకరణ పట్టిక

---

### I Classification of Sounds.

వర్ణసమామ్నాయము, వర్ణోత్పత్తిసాధనములు, పరుష సరళ లఘ్వలఘు దంత్యతాలవ్యాది వర్ణ భేదములు.

పదములందు ఆద్యక్షర నియమము.

కళలు, ద్రుతప్రకృతికములు.

సిద్ధ సాధ్య బిందువులు, అనుస్వారభేదములు.

### II Classification of Words in general.

తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య భేదములు.

ఏతద్భేద సూచక వర్ణములు.

తత్సమము లేర్పడు రీతి.

### III Rules of Sandhi.

సంధి సూత్రములు:—

A. సంస్కృతసంధి:—

1. సవర్ణదీర్ఘసంధి, 2. గుణసంధి, 3. వృద్ధిసంధి, 4. సకారాంత శబ్దసంధి, 5. హల్ సంధి.

N. B. (కేవల పదవిభాగము మాత్రమే నేర్పవలసినది.)

B. తెనుగుసంధి:—

1. అచ్సంధి, 2. ద్రుతప్రకృతికసంధి, 3. ఆమ్రేడితసంధి, 4. సమాస సంధి యు-రు-ను వు-టు; గాద్యాగమసంధులు.

IV Typical declension of Nouns, 'Pronouns Numerals and Aupavibhaktika words.

1. నామవాచక, సర్వనామ, సంఖ్యావాచక, ఔపవిభక్తికములకు లింగవచన విభక్తిరూపములు.
2. విభక్త్యుపయోగములు.

V Samasa or Compounding of words.

1. సమాసస్వరూపములు:—సిద్ధసాధ్యభేదములు.
2. తత్పురుష, కర్మధారయ, బహువ్రీహి, ద్వంద్వ ద్విగుసమాసములు.

VI Verbs Conjugation and Verbal forms.

1. సమాపక్రియలు.
   a. భూత భవిష్యద్వర్తమాన తద్ధర్మార్థక రూపములు.
   b. ఆత్మనేపద, ప్రేరణ, ప్రార్థన, ఆశీరాద్యర్థక రూపములు.
2. అసమాపక క్రియలు:—భావార్థక, క్త్వార్థక, తుమున్నాద్యర్థక, చేదర్థక, అనంతర్యార్థక రూపములు.
3. వ్యతిరేకరూపములు.
4. విశేషణ రూపములు.
5. శబ్దపల్లవములు, తత్సమధాతువులు.

VII Formation of Abstract Nouns from Nouns and Verbs కృత్తద్ధితరూపములు.

VIII Syntax, Analysis, Transformation of Sentences and Paragraph construction.

1. కర్తర్యర్థక, కర్మార్థక ప్రయోగములు.
2. వాక్యములను నిర్దిష్టప్రకారము మార్చుట.

3. వ్యాసరచనలో విషయ విభాగము ననుసరించి వాక్యార్థరచన. (Paragraphs) చేయుట.

4. వ్యాసముల యుపక్రమోపసంహార క్రమము.

## IX Errors in Grammar aud Syntax.

వాక్యసంయోగ లోపములు.

1. ఆద్యక్షరదోషములు, యు. ఇ. యీ. యొ. యో. వు. వూ. వొ. వో మొదలగునవి.

2. ద్రుత ప్రకృతికములమీఁద యకారాగమ దోషములును, కళల మీఁద నకారాగమ దోషములును.

3. దుష్ట హల్ సంయోగ దోషములు.

4. వ్యతిరేకార్థ మిచ్చునట్లు ప్రార్థనార్థక రూపమును వాడుట.
   ఉదా:—చేయుమనె ననుటకు చేయమనెను అని వాడుట.

5. ప్రార్థనార్థకము:—వర్ణమును లోపింపఁజేయుట.

6. ఆత్మనేపదార్థమున కొనుకు కకారమును, ధాతువులోని యకారమునకు సుకారము వచ్చుటయు మొదలగు దోషములు.
   ఉదా:—చేసుక, మోసుకొని.

7. క్త్వార్థక ఇకార సంధిదోషము.

8. ఉత్తమపురుష సంధి దోషము.
   ఉదా:—చేసితిఁ + అపుడు = చేసితపుడు.

9. వర్ణవ్యత్యాసములు:—
   ఉదా:—శ, ష, స, లు, ద, ధ, లు వత్తక్షరములున్నచోట వదలిపెట్టుట; లేనిచోట నంచుట మొదలగునవి.

10. లింగవచన విరోధములు.

11. విశేషణ, విశేష్య విరోధములు.

12. అర్థములలో పునరుక్తి.
13. ఔపవిభక్తికములను సామాన్యశబ్దములుగా వాడుట.

## X Prosody. Metrics in Prosody occurring in the detailed text.

ఛందస్సు, గణములు.

చంపకమాల, ఉత్పలమాల, మత్తేభము, శార్దూలము, మత్తకోకిల, పంచచామరము, ఉత్సాహ ద్విపద, కందము, సీసము, గీతము, ఆటవెలది.

## XI Chief Figures of Speech.

అలంకారములు.

ఉపమ, అనన్వయ, స్మరణ, రూపక, ఉత్ప్రేక్ష, సందేహ, భ్రాంతిమత్, విషమ, అతిశయోక్తి, ఆక్షేప, వ్యతిరేక, సమాసోక్తి, విరోధాభాస, తుల్యయోగిత, దృష్టాంత, అర్థాంతరన్యాస, శ్లేష, కావ్యలింగా లంకారములు.

# వి ష య సూ చి క

పుట.

## అధ్యాయము ౧



## అధ్యాయము ౨



## అధ్యాయము ౩



## అధ్యాయము ౪



## అధ్యాయము ౫



## అధ్యాయము ౬

## అధ్యాయము ౭



## అధ్యాయము ౮



## అధ్యాయము ౯



## అధ్యాయము ౧౦



## అధ్యాయము ౧౧

# ఆంధ్రవ్యాకరణ సర్వస్వము

## భాష

౧. భాషించుట కుపయోగపడునది భాషయనఁబడును.

౨. అది ౧ వాగ్రూపము, ౨ లిఖితరూపము అను రెండు విధముల నుండును.

(౧) కొన్ని భాషలు కేవలము మాట్లాడుటకు మాత్రము తగియుండును. (కాని లిపియుండదు.)

ఉదా:— ఎఱుకలభాష, కోయభాష మొ॥

(౨) కొన్ని భాషలు భాషించుటకు, లిఖించుటకు నుపయోగింపఁబడుచున్నవి. ఉ:—సంస్కృతము, ఆంధ్రము, ఇంగ్లీషు మొ॥

౩. వాగ్లిఖితరూపములనున్న భాషలోని తప్పొప్పులను దెలుపు శాస్త్రమునకు వ్యాకరణమని పేరు.

౪. భాష నాధారము జేసికొని కవులు కావ్యములను వ్రాయుదురు. వాని నాధారముచేసికొని పండితులు వ్యాకరణము రచింతురు.

౫. ఆంధ్ర వ్యాకరణ మనఁగా ఆంధ్రభాష యందలి తప్పొప్పులను దెలియఁజేయునది.

౬. ఈ వ్యాకరణము నాలుగు భాగములుగ భాగింపవచ్చును.

౧. భాషా పరిచ్ఛేదము
౨. పద పరిచ్ఛేదము
౩. వాక్య పరిచ్ఛేదము
౪. దోష పరిచ్ఛేదము
౫. కావ్య పరిచ్ఛేదము
౬. అలంకార పరిచ్ఛేదము

---

## అధ్యాయము ౧

## వర్ణసమామ్నాయము (Alphabet)

## (CLASSIFICATION OF SOUNDS)

౧. అక్షరములు (Letters) :— భాషయందుఁగల వివిధములగు ధ్వనులను వ్రాతయందుపయోగించుకొను గుర్తులకు అక్షరములు లేక వర్ణములు అని పేరు.

౨. ఆంధ్రభాషకు వర్ణములు ౫౬.

౩. ఇవి (౧) అచ్చులు (౨) హల్లులు (౩) ఉభయములు అని మూఁడు విధములు.

(౧) అచ్చులు (Vowels):—

౪. అచ్చులు పదునాఱు. ఇవి ఇతరవర్ణ సహాయము లేక యుచ్చరింపఁబడునవి. (వీనికి స్వరములు, ప్రాణములు అని మాఱుపేళ్ళు గలవు.)

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ.

౫. వీనిలో: అ. ఇ. ఉ. ఋ. ఌ. ఎ. ఒ అను నేడును హ్రస్వములు. (Short vowels).

౬. ఆ. ఈ. ఊ. ౠ. ౡ. ఏ. ఐ. ఓ. ఔ అను తొమ్మిది దీర్ఘములు, (Long vowels.)

౭. ఎ ఏ ఒ ఓ అను నాలుగువక్రములు. ఐ. ఔ అను రెండు వక్రతమములు.

(౨) హల్లులు (Consonants):—

౮. హల్లులు ముప్పదియేడు. ఇవి అచ్చుల సహాయము లేక పూర్తిగా నుచ్చరింపఁ బడఁజాలవు. (వీనికి వ్యంజనములు, ప్రాణులు అని మాఱుపేర్లు.)

క ఖ గ ఘ ఙ; చ ౘ ఛ జ ౙ ఝ ఞ; ట ఠ డ ఢ ణ; త థ ద ధ న; ప ఫ బ భ మ; య ర ఱ ల వ శ ష స హ ళ.

(3) ఉభయములు :—

౯. ఉభయాక్షరములు మూఁడు. ఁ (అర్ధానుస్వారము), ం (పూర్ణానుస్వారము), ః (విసర్గము). అచ్చుల యొక్క, హల్లులయొక్క ధర్మములు కలవి కావున ఉభయాక్షరము లనఁబడును. (అచ్చులమీఁదవలెనే వీనిమీఁదఁగూడ అచ్చురాదు. ఇవియు హల్లులవలెనే స్వర సహాయము లేక యుచ్చరింపఁబడవు.)

౧౦. సంస్కృతమునకు వర్ణము లేఁబది.

౧౧. అచ్చులు ౧౪ :—అ. ఆ. ఇ. ఈ. ఉ. ఊ. ఋ. ౠ. ఌ. ౡ. ఏ. ఐ. ఓ. ఔ.

౧౨. హల్లులు ౩౪ :— క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ శ ష స హ ళ.

౧౩. ఉభయములు ౨ :— ం - ః.

౧౪. సంస్కృతమునుండి గ్రహింపఁబడి తత్సమంబులం గూడి తెలుఁగున వర్తించునవి. ౧౯ :— ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ ఙ ఞ శ ష.

౧౫. అచ్చ తెలుఁగున మాత్ర ముపయోగించు వర్ణములు ౬ :—ఎ. ఒ. ఁ. ౘ. ౙ. ఱ.

౧౬. క. చ. ౘ. ట. త. ప. అను నాఱును పరుషములు (Hard Consonants)

౧౭. ఖ. ఛ. ఠ. థ. ఫ. అను నైదును వర్గయుక్పరుషములు.

౧౮. గ. జ. ౙ. డ. ద. బ. అనునాఱును సరళములు (Soft Consonants).

౧౯. ఘ. ఝ. ఢ. ధ. భ. అను నైదును వర్గయుక్సరళములు.

౨౦. పరుషసరళములు కాక తక్కిన ౨౫ హల్లులకు స్థిరములని పేరు.

౨౧. కకారము మొదలు మకారము వఱకుఁ గల హల్లులకు స్పర్శములనియు, వర్గాక్షరము లనియుఁ బేళ్లు కలవు.

౨౨. ఇవి ౫ వర్గములుగా విభజింపఁబడినవి.

౧. క ఖ గ ఘ ఙ అనునవి కవర్గము.
౨. చ ఛ జ ఝ ఞ ,, చవర్గము.
౩. ట ఠ డ ఢ ణ ,, టవర్గము.
౪. త థ ద ధ న ,, తవర్గము.
౫. ప ఫ బ భ మ ,, పవర్గము.

౨౩. ఙ ఞ ణ న మ అను నైదును అనునాసికములు.

౨౪. య ర ల వ లు అంతస్థములు.

౨౫. శ ష స హ లు ఊష్మములు.

౨౬. నకారమునకు ద్రుతమని పేరు.

ఉత్పత్తి స్థానములు (SOUND ORIGIN)

౨౭. (౧) అ ఆ క ఖ గ ఘ ఙ హ ః - కంఠ్యములు (Gutturals) కంఠసహాయముతోఁ బల్కఁబడునవి.

(౨) ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ - తాలవ్యములు (Palatals) దౌడల సహాయముతోఁ బల్కఁబడునవి.

(౩) ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష - మూర్ధన్యములు (Linguals) అంగిలి సహాయముచేఁ బల్కఁబడునవి.

(౪) ఌ ౡ త థ ద ధ న ల స-దంత్యములు (Dentals) దంతముల సహాయముతోఁ బల్కఁబడునవి.

(గి) ఉ ఊ ప ఫ బ భ మ -ఓష్ఠ్యములు (Labials) పెదవుల సహాయముతోఁ బల్కఁబడునవి.

(౬) ఙ ఞ ణ న మ ం-అను నాసికములు (Nasals) ముక్కు సహాయముతోఁ బల్కఁబడునవి.

(౭) ఎ ఏ ఐ కంఠతాలవ్యములు

(౮) ఒ ఓ ఔ కంఠోష్ఠ్యములు

(౯) వ దంతోష్ఠ్యము

౨౮. ఇ ఈ ఎ ఏ లఁ గూడిన "చ జ" లు తాలవ్యములు. (Palatals)

ఉదా:— చిలుక. చీమ. చెవి. చేను. జిల. జీడి. జెట్టి. జేజె.

౨౯. అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ లం గూడిన చ జ లు దన్త్యములు (Dentals).

(పై అచ్చులతోఁ గూడినపుడు చ జ లకు గుర్తుగా అక్షరముల పైని "౨" అనుదాని నుంచునది)

ఉదా:—చలి, చాప, చుక్క, చూపు, చొక్క, చోటు, చౌకము, జముఁడు, జాతర, జున్ను, జూలు, జొన్న, జోలి, జౌను.

౩౦. చై జై లు తెలుఁగుమాటల మొదట నుండవు. (చెయ్యము మొదలగువానికి 'చైదము' రీతి వ్రాయరాదు).

31. ఇకారాంతశబ్దముల ఉపధా చ జ లు బహువచనము పరంబైనపుడు తత్సమములందు దంత్యము లగును. 'ఉపధ' యనఁ దుదివర్ణమునకు ముందుండు వర్ణము.

ఉదా :—వీచి-వీచులు. రాజి-రాజులు.

32. తత్సమములమీఁది చ జ లు కొండొకచో 'ఉ'కారముతోఁ గూడి దంత్యములగును.

ఉదా :—అచ్-అచ్చులు-రాజన్-రాజులు.

33. లఘ్వలఘువులు- (Light and Harsh Semi-vowels) య ర ల వ అనునవి. 1 లఘువులు, 2 అలఘువులు అని రెండు విధములు.

(1) సాధ్యమగు యకారము లఘువు.

ఉదా :—అది + ఏమి = అది యేమి. (వ్యాకరణము వలన సిద్ధించినది సాధ్యము.)

(2) సిద్ధమగు యకారము అలఘువు (సిద్ధము = సహజము) - ఉదా :—కాయ.

(1) రేఫము లఘువు - ఉదా :—పెరుగు.

(2) శకటరేఫము అలఘువు - ఉదా :—చెఱకు.

(1) సిద్ధమగు లకారము లఘువు - తల.

(2) సాధ్యమగు ళకారము అలఘువు.

ఉదా :—(ఏఱు) ఏళులు.

(1) సాధ్యమగు ప్రథమమీఁది వకారము లఘువు.

ఉదా:—అతఁడు + వలికె = అతఁడు వలికె.

(౨) సిద్ధమగు వకారము అలఘువు - ఉదా:-వాఁగు.

౩౪. ణ య ళ వు వూ వొ వో అను నక్షరములు తెనుఁగుమాటలకు ముందుండవు.

౩౫. ఉయ్యేల, పయ్యెద, తాయెతు అనుమాటలలోఁ దప్ప పదమధ్య యకారమునకు ఎత్వముండదు.

ఉదా :—కయ్యము, వియ్యము.

౩౬. పొల్లు నకారమునకు ద్రుతము అని పేరు. ఇది నికారముగను, నుకారముగను మాఱుచుండును.

౩౭. తెనుఁగు శబ్దములన్నియు కళలు, ద్రుతప్రకృతికములు అని రెండు విధములు.

కళలు :—

౩౮. ద్రుతము అంతమందు లేని పదములు కళలు.

(౧) నామవిభక్తులలో డు. ము. వు. లు. కూర్చి. కై. పట్టి. యొక్క సంబోధన ప్రత్యయములును -

ఉదా :—విభక్తులు : —రాముఁడు, వనము, ధేనువు, రాములు, రాముఁగూర్చి, రామునకై, జ్ఞానముఁబట్టి, జ్ఞానము యొక్క, రాముఁడా, రాములారా.

(౨) ని. ను. అనునవి యంతమందు లేని క్రియారూపములు.

ఉదా :-పాడుచున్నాము. పాడితిమి. పాడితివి. పాడితిరి. పాడుచున్నావు. పాడుచున్నారు. పాడరు. పాడడు. పాడవు మొ॥

(3) లాక్షణి కావ్యయములగు క్త్వార్థక, వ్యతిరేక క్త్వార్థక, భావార్థక, వ్యతిరేక భావార్థకములు.

ఉదా:—క్త్వా. పాడి- వ్య. క్త్వా-పాడక, భా. పాడుట- వ్య. భా-పాడమి.

(४) ప్రతిపదోక్తావ్యయములగు:—

౧. కించిదర్థకము : ఇంచుక-కొంచెము
౨. ప్రశంసార్థకము:—అయ్యారే-బళి
3. ఆశ్చర్యార్థకము:— ఔరా - ఆహా
४. సంతాపార్థకము:—అకటా - కట్టా
౫. యదాతదార్థకములు:—ఎపుడు-అపుడు.
౬. సంప్రత్యర్థకము:—ఇప్పుడు.
౭. ఆశీరాద్యర్థకము:—కాక.
౮. కిమర్థకము:—ఏమి-ఏది.
౯. ఏవార్థకము లేక అవధారణార్థకము:-అ. ఆ. ఎ. ఏ.
౧౦. భావార్థకము:—వచ్చుట.
౧౧. ప్రశ్నార్థకము:—ఏల-ఏలా.
౧౨. తూష్ణీమర్థకము:—ఊరక-మిన్నక.
౧3. కిలార్థకమును గళలు:—కద-కదా.

ద్రుతప్రకృతికములు:—

3౯. అంతమందు ద్రుతముగల పదములు ద్రుత ప్రకృతికములు. అవి (౧) విభక్తి ప్రత్యయములలో డు, ము, వు, లు, కూర్చి, కై, పట్టి, యొక్క, సంబోధన ప్రత్యయములు కాక తక్కినవన్నియు

అనఁగా:—నిన్. నున్. లన్. చేతన్. చేన్. తోడన్ తోన్. కొఱకున్. వలనన్. కంటెన్. కిన్. కున్. లోపలన్. లోన్. అందున్. నన్. (ఇందున్. ఎందున్ అనునవి.)

౨. ఏను, నేను, తాను పదములును,

౩. క్రియా పదంబులందు ఉత్తమపురుష ఏకవచనములును,

ఉదా:—పాడుచున్నాను, పాడితిని, పాడఁగలను, పాడుదును.

౪. భూత, తద్ధర్మార్థక ప్రథమపురుష ఏకవచనములును. ఉదా:—పాడెను, పాడున్, పాడెడున్, పాడెడిన్.

౫. ఆశీరాద్యర్థకంబులగు ఎడున్, తన్, వర్ణకంబులును. ఉదా:—అయ్యెడున్, కావుతన్.

౬. అవ్యయములందు:— లాక్షణికావ్యయములగు - శత్రు, తుము, క్త్వానంతర్య, చేదాద్యర్థకములు.

ఉదా:— శత్రు:—పాడుచున్.
తుమున్:—పాడన్, పాడగన్
ఆనంతర్య:—పాడుడున్
చేత్:—పాడినన్

౭. ప్రతిపదోక్తావ్యయములు, ఎల్లన్, ఇకన్, ఎట్టకేలకున్, పోలెన్, వలెన్, కైవడిన్, క్రమ్మఱన్, ఒండెన్, పిమ్మటన్, పిదపన్, గ్రక్కునన్, కావునన్.

౮. సముచ్చయార్థకములైన "యు, ను" లును ద్రుతప్రకృతికములు.

అనుస్వారము :—

౨౦. స్వరమును (అచ్చును) అనుసరించి యుండును. కావున సున్నకు అనుస్వారమని పేరు. అనుస్వారమునకు బిందు వని నామాంతరము కలదు. బిందువు పూర్ణ (ం) ఖండ (ఁ) భేదముచే రెండు విధములు.

౨౧. పూర్ణఖండబిందువులు సిద్ధ, సాధ్య భేదముచే రెండువిధములు.

(సిద్ధము-శబ్దముతోడనే పుట్టినది. సాధ్యము-వ్యాకరణముచే వచ్చినది.)

సిద్ధపూర్ణము: ఉదా:—చెండు, పండు

సిద్ధఖండము: ఉదా:—మ్రూఁక, అరఁటి

సాధ్యపూర్ణము: ఉదా:—చెంగలువ, సంగోరు

సాధ్యఖండము: ఉదా:—వచ్చెఁ గమలాక్షుఁడు, విచ్చెఁబద్మము.

సిద్ధఖండముగల కొన్ని పదములు:—

| | | |
|---|---|---|
| అఁట | కాఁగు | త్రాఁగి |
| అణఁగు | కాఁపు | లాఁతి |
| అనఁటి | గోఁగు | వాఁడి |
| అనవుఁడు | చీఁకటి | వాఁపు |
| అనుఁగు | చేఁదు | సాఁకు |
| ఇఁక | తలఁకు | సోఁకు |
| ఈఁటె | తేఁట | సోఁగ |

| | | |
|---|---|---|
| ఈఁగ | ప్రేఁపు | వేఁగు |
| ఊఁక | తోఁట | వెలఁగ |
| ఊఁచ | నాఁగలి | మూఁడు |
| ఊఁదుట | ప్రాఁత | వెడఁద |
| ఏఁడు | మడుఁగు | వేఁట |
| ఏఁపు | మూఁగు | వేఁడి |

౪౨. తెనుఁగు మాటలయందుఁ బరుష సరళములకు ముందే బిందువు కనఁబడుచున్నది.

ఉదా:—వంగ, గంప, పంట, మూఁక మొదలగునవి. ఖండబిందువులుగల కొన్ని తావులు:—

(౧) పురుషుని బోధించు పదాంతమందలి 'డు' వర్ణకమునకు ముందును. ఉదా:—రాముఁడు, వచ్చినాఁడు.

(౨) పరిమాణమును దెల్పు 'ఎఁడు' వర్ణకము నందును. ఉదా:—గోనెఁడు, గరిటెఁడు.

(3) మధ్యమపురుష బహువచనమునవచ్చు 'డు' వర్ణకమునకు ముందును. ఉదా:—చూడుఁడు, చేయుఁడు.

(౪) స్త్రీవాచ్యంబగునపుడు మత్వరంబునవచ్చు 'ఆఁడి' వర్ణకము మధ్యను. ఉదా:—వగలాఁడి, వన్నెలాఁడి.

(౫) యకారాంత ధాతువుల కృదంత రూపములందలి 'త' వర్ణకమునకు ముందును.

ఉదా:—కోయు, కోఁత, మ్రాయు, మాఁత.

(౬) నామ్వాది శబ్దములందలి 'ము' వర్ణమున కాదేశమగు 'వ' వర్ణమునకు ముందును.

ఉదా:—నాము, నాఁవ; వేము, వేవ.

(౭) 'ను' వర్ణము కడపటఁ గల విశేష్యములకు రూపాంతరముగా వచ్చిన 'కు, గు' అనువర్ణములకు ముందును.

ఉదా:—కలను, కలఁకు; రేను, రేఁగు.

(౮) లేమిడిని తెల్పు 'ఇఁడి' ప్రత్యయమునందును అరసున్న లుండును. ఉదా:—ముక్కిఁడి, లేమిఁడి;

౨౩. అఁట, ఇఁక, చుఁడు అనుశబ్దములఁదప్ప నుడి తొలిహ్రస్వముమీఁద నరసున్న లేదు.

౨౪. సంయుక్తాక్షరము గాని, ద్విత్వాక్షరము గాని పరమైనచో నరసున్న లోపించును.

ఉదా:—మడుఁగు - మడ్గు; మాఁడుచు - మాడ్చు,

౨౫. హ్రస్వముమీఁది ఖండబిందువు వైకల్పికముగాఁ బూర్ణబిందువగు. ఉదా:—కలఁగి, కలంగి; తొలఁగి, తొలంగి.

౨౬. దీర్ఘముమీఁది ఖండబిందువు పూర్ణబిందువు కాదు.

ఉదా:—వాఁడు, నేఁ జదివితి.

---

## అధ్యాయము ౨

## సాధారణ శబ్దవిభాగము

## (CLASSIFICATION OF WORDS IN GENERAL)

### శబ్దవిభాగము (Parts of Speech)

౧. ఆంధ్రభాష తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము అని నాలుగు విధములు.

**తత్సమములు:—**

౨. తత్సమము, సంస్కృత శబ్దముతోడను, ప్రాకృత శబ్దముతోడను సమానమైన రూపము గలది.

ఉదా:—రామః = రాముఁడు, ధేనుః = ధేనువు, వనమ్ = వనము.

సంస్కృత ప్రాకృత శబ్దముల కడపటనుండు విసర్గమును గాని, పొల్లును గాని, దీర్ఘమును గాని త్రోసివేసి వలసినచోట డు, ము, వు ప్రత్యయములు చేర్చినఁ దత్సమము అగును.

తత్సమశబ్దములను దెలిసికొను విధములు:—

(౧) సంస్కృతమునుండి తెనుఁగునలేని ఋ. ౠ. ఌ. ౡ. ః. ఖ. ఘ. ఙ. ఛ. ఝ. ఞ. ఠ. ఢ. థ. ధ. ఫ. భ. శ. ష. యనునక్షరములుగల శబ్దములును.

(౨) య. వృ. వ్యా. వా. వో. చై. జై అను నక్షరములు మొదటఁగల శబ్దములును.

ఉదా:—యతి, వోఢ, చైత్రము, జైత్రుఁడు.

(3) అనుస్వారమునకుఁ గుడిప్రక్కఁబరుష సరళములు గాక తక్కిన యక్షరములు గల శబ్దములు.

ఉదా:— హంసము, వింశతి.

(౪) రేఫేతరహల్లుతోఁ సంయుక్తమైన యక్షరములు గల శబ్దములును. ఉదా:— స్యందనము, మత్సరము.

(౫) ప్ర. పరా. అప. సమ్. ని. అవ. నిర్. దుర్. వి. అధి. సు. ఉత్. పరి. ప్రతి. అభి. ఉప. అపి. ఆఙ్. అతి అను ప్రాదులు లేక ఉపసర్గలు మొదటనుండు పదములు.

ఉదా:— ప్రతాపము, నివాసము.

(౬) అప్రేరణమున ఇంచుతోఁ గూడిన ధాతువులును దత్సమములు. ఉదా:—వధించు, త్యజించు, గణించు.

తత్సమములకుఁ గొన్ని యుదాహరణములు:—

| సంస్కృతము | ప్రాకృతము | తత్సమము |
|---|---|---|
| హరిః | | హరి |
| గౌః | | గోవు |
| పితా | | పిత |
| అగ్నిః | అగ్గీ | అగ్గి |
| క్షారః | కారో | కారము |
| యమః | జమో | జముఁడు |
| శృంగారః | సింగారో | సింగారము |
| శ్రీః | సిరీ | సిరి |
| గౌరవమ్ | గారవం | గారవము |

| సంస్కృతము | ప్రాకృతము | తత్సమము |
|---|---|---|
| జటా | జడా | జడ |
| రాజ్ఞీ | రాణీ | రాణి |
| సవితృ | | సవిత, సవితృఁడు |
| మూర్ఖః | మూర్ఖో | మూర్ఖుఁడు, మూర్ఖు |

తద్భవము:—

3. సంస్కృత ప్రాకృత శబ్దములవలనఁ బుట్టినవి తద్భవములు.

౪. సంస్కృత ప్రాకృతశబ్దములందు గల యక్షరము పోవుట (వర్ణలోపము) చేనైనను, క్రొత్తయక్షరము నెక్కువగఁ జేరుట (వర్ణాగమము) చేనైనను, యక్షరములు ముందు వెనుక మారుట (వర్ణవ్యత్యయము) చేనైనను తద్భవము లేర్పడును.

వర్ణలోపము. ఉదా:-భోజనమ్=బోనము, జయ=జే.

వర్ణాగమము. ఉదా:-రథః=అరదము, దేవః=దేవర.

వర్ణవ్యత్యయము. ఉదా:-శుచిః=చిచ్చు, కక్షః=చంక.

తద్భవములకుఁ గొన్ని యుదాహరణములు:—

| సంస్కృతము | ప్రాకృతము | తద్భవము |
|---|---|---|
| సముద్రః | | సంద్రము |
| చంద్రః | | చందురుఁడు |
| సూచీ | | సూది |
| స్మరః | | మరుఁడు |

| సంస్కృతము | ప్రాకృతము | తద్భవము |
|---|---|---|
| హరితాళం | | హరిదళము |
| అంగారః | ఇంగాలో | ఇంగలము |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు |
| ప్రయాణమ్ | పయాణం | పయనము |
| ప్రవాళః | పవాళో | పవడము-పగడము |
| యజ్ఞః | జణ్ణో | జన్నము |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు |
| స్థూలమ్ | థోరం | తోరము |
| వైద్యః | వెజ్జో | వెజ్జు |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |

దేశ్యము:—

౧౭. దేశమున వ్యవహరింపఁబడు శబ్దములు దేశ్యము లనఁబడును. ఇవి ఆంధ్రదేశ్యము, అన్యదేశ్యము అని రెండు విధములు.

౧౮. ఆంధ్రదేశమునందు మాత్రమే వాడఁబడు శబ్దము లాంధ్రదేశ్యములు. ఉదా:—తల్లి, తండ్రి, కూర, కాయ.

౧౯. ఆంధ్రమున వాడఁబడుచున్న యితర భాషాశబ్దములు అన్యదేశ్యములు. ఉదా:—శవర, కీవి.

౮. గ్రామములలోని (పామర) జనులు వాడుకొను శబ్దములు గ్రామ్యములు. ఇవి నింద్య గ్రామ్యములు, అనింద్య గ్రామ్యములు అని రెండువిధములు.

౯. వ్యాకరణమునకు విరుద్ధమైన శబ్దములు నింద్య గ్రామ్యములు. ఉదా:—మావూరికి నీవెపుడొచ్చావు.

౧౦. వ్యాకరణ విరుద్ధములైనను మహాకవులచే గ్రంథములలో వాడఁబడిన శబ్దములు అనింద్యగ్రామ్యములు.

ఉదా:—కలకంఠుఁడు, జీవగఱ్ఱ.

౧౧. సంస్కృత నామములలోఁ గొన్ని అజంతములు (అచ్చు అంతమందుఁగలవి); కొన్ని హలంతములు (హల్లు అంతమందుఁగలవి) గా నుండును.

తత్సమము లేర్పడురీతి :—

౧౨. ధాతుభిన్నమును, ప్రత్యయ భిన్నమును ప్రత్యయాంతభిన్నమునై యర్థముగలశబ్దమును 'ప్రాతిపదిక'మందురు. నామ మ ను న ది దీనికి నామాంతరము. ప్రత్యయములను ప్రాతిపదికములకే చేర్పవలయును.

౧౩. అకారాంత పుంలింగమై మహాద్వాచకంబగు ప్రాతిపదికమునకు 'ఁడు' అగు.

ఉదా:—రామః-రాముఁడు. కృష్ణః-కృష్ణుఁడు.

౧౪. ఁడువర్ణకము చేరు-చోఁ బదాంతమందలి అత్త్వము నకు త్త్వంబగును.

౧౫. వృద్ధాది శబ్దములకు ఉత్త్వంబగు. ఁడు వర్ణకము విభాషనగును.

ఉదా:—వృద్ధు, వృద్ధుఁడు. మూర్ఖు, మూర్ఖుఁడు, గృహస్థు, గృహస్థుఁడు. చార్వాకు, చార్వాకుఁడు.

౧౬. భట్టాది శబ్దములకు డు వర్ణకమురాదు.

ఉదా:—అన్నంభట్టు, నారాయణభట్టు, నన్నయభట్టు.

౧౭. అకారాంతములైన నపుంసకములకు నమహత్తులకుఁ దత్సమము లగునపుడు ము వర్ణకము చేర్పఁబడును.

ఉదా:—ధనం = ధనము, వృక్షః = వృక్షము.

౧౮. అమహత్తులకుఁ గొన్నిటికి మహద్వివక్షయందుఁ బుంలింగమునకువలె ఁడు వర్ణకమును నగును.

ఉదా:- మేఘము, మేఘుఁడు, సముద్రము, సముద్రుఁడు.

౧౯. కుశాదులకు ము వర్ణకమురాదు. (కుశ, దర్భ, పనస, కోట యివి కుశాదులు.)

౨౦. చరిత్రాదులకు ము వర్ణలోపము విభాషనగును.

ఉదా:—చరిత్ర, చరిత్రము, అభిలాష, అభిలాషము, (చరిత్ర, అభిలాష, అక్షత, అలక, ఆరాధన, ఆవాహన, అర్పణ, ఈక్షణ, ఆలోచన, గర్జన, గర్హా, ఘోష, చామర, చిహ్న, చరణ, తోరణ, తరంగ, నటన, పారణ, ప్రార్థన, ప్రయాగ, ప్రశ్న, బోధ, భ్రమ, లాలన, రంజన, వత్స, వధ, విమర్శన, విజృంభణ, వర్తన, సారణ, సంబోధన, స్ఫురణ, హంస, సర్గ, పాత్ర, శ్లేష మొదలైనవి.)

౨౧. దూతాదులు పురుష వాచకంబులు లైనయెడఁ బుంలింగరూపంబును స్త్రీసమరూపంబును; తదితర వాచకంబులగునెడ స్త్రీ సమరూపంబును బొందును.

ఉదా:—దూత, దూతుఁడు; యోధ, యోధుఁడు; శుంఠ, శుంఠుఁడు, సింగంబు దూత జంబుకము.

౨౨. మిత్రాదులు పురుషవాచకములైనఁ బుంలింగ నపుంసకలింగరూపముల నొందును. అట్లుకానిచో నపుంసక లింగములవలె నుండును. ఉదా:—మిత్రము, మిత్రుఁడు; శరణము, శరణుఁడు.

(మిత్ర, శరణ, ప్రధాన, కేవల, సామాన్య, పాత్ర మొదలైనవి మిత్రాదులు)

౨౩. ఒడ్డెఁడు, కర్తృఁడు, కోటఁడు, బసవఁడు; ఈ నాల్గును పురుషవాచకములు గాకున్నను దదూపమును బొందెను. వీనికి ము వర్ణకము రాదు.

౨౪. ఇకారాంతములకుఁ బ్రథమైకవచన ప్రత్యయములురావు. ఉదా:—హరిః హరి; మతిః మతి; అరిః అరి; ఖనిః ఖని.

౨౫. ఉకారాంతములు వు వర్ణకముచేరి తత్సమములగును. ఉదా:—గురుః, గురువు; విష్ణుః, విష్ణువు; శంభుః, శంభువు; ధేనుః, ధేనువు; మనుః, మనువు; కటుః, కటువు; తరుః, తరువు మొదలైనవి.

౨౬. మను శబ్దమునకుఁదక్క నుకారాంత మహద్వాచక శబ్దములకు "ఁడు" వర్ణకముకూడ వచ్చును.

ఉదా:— గురువు, గురుఁడు; శంభువు, శంభుఁడు; విష్ణువు, విష్ణుఁడు; జరత్కారువు, జరత్కారుఁడు; మధువు, మధుఁడు; మొదలగునవి. (మనువు.)

౨౭. ధర్మాదులకు వు వర్ణకంబు వచ్చును. అట్టిచోఁ బదాంతమందలి అకార ముఃకారమగును.

ఉదా:— ధర్మము, ధర్ముపు; అర్ఘము, అర్ఘువు, వర్గము, వర్గువు.

౨౮. ఋకారాంతములు అకారాంతములై స్త్రీ సమములుగా నగును. ఉదా:—పితృ, పిత, మాతృ, మాత.

(పిత. మాత. స్వస. సప్త. హోత. నేత. ఉద్గాత. భ్రాత, జామాత. భర్త. హర్త. గంత. హంత. నియంత మొదలైనవి.)

౨౯. పుంలింగములగు విధాత్రాదులకు 'ఁడు' వర్ణకమును వచ్చును.

ఉదా:— విధాత, విధాతృఁడు, ధాత, ధాతృఁడు, దాత, దాతృఁడు, సవిత, సవితృఁడు, నేత, నేతృఁడు మొదలైనవి.

౩౦. దీర్ఘాంతములు తత్సమములగునెడ హ్రస్వాంతములగును.

ఉదా:-సీతా-సీత; రమా-రమ; గౌరీ-గౌరి; ద్రౌపదీ-ద్రౌపది; జానకీ-జానకి; క్షమా-క్షమ; అచలా-అచల మొదలైనవి.

3౧. ఉకారాంతములుకాని స్త్రీలింగములు ప్రథమైక వచనప్రత్యయములను బొందవు.

3౨. ఉకార ఊకార ఓకారాంతములు వు వర్ణకమును బొందును. ఉదా:—ధేనుః - ధేనువు; వధూః - వధువు; గౌః - గోవు; భ్రూః - భ్రూవు మొదలైనవి.

33. ఏకాక్షరములగుపదముల దీర్ఘమునకు హ్రస్వము రాదు. ఉదా:—శ్రీ—శ్రీ, మా, క్ష్మా, స్త్రీ, ధీ.

3౪. సురశబ్దము నిత్యముగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీసమంబులగు. సంస్కృతసమాసమునఁగావు. వ్యస్తమగు సురశబ్దమున కేకవచనము లేదు.

ఉదా:—సురలు, అసుర - అసురుఁడు, (సం॥ స॥) భూసురుఁడు, తారకాసురుఁడు.

3౫. వ్యస్తము నేకవచనము నైన జనశబ్దము నపుంసకలింగము.

ఉదా:—జనము- (సమాసమున) ఏజనుఁడు; (బహువచనమున) జనులు.

3౬. ప్రభవాది సంవత్సరముల నామములు స్త్రీలింగములు. ఉదా:—ప్రభవ, విభవ, శుక్ల మొదలైనవి.

3౭. కంధరాదులకు మువర్ణకము బహుళముగనగును.

ఉదా:— కంధర, కంధరము, అర్చన, కల్పన, ఉలూ, ఘట్టన, గ్రీవ, సంభావన, పాలన, పాదుక, భిక్షు, దంష్ట్ర, మాయ, మిష మొదలైనవి.

## హలంతములు

౩౮. శ్వశబ్దము ద్వితీయైక వచనాంతసమము.

ఉదా:—శ్వానమ్ - శ్వానము.

౩౯. హలంతశబ్దముల తుదిహల్లునకు ద్విత్వంబును ఉత్వంబును అగును.

ఉదా:—దిక్ = దిక్కు; రాట్ = రాట్టు; మరుత్ = మరుత్తు మొదలైనవి.

౪౦. దీర్ఘముమీఁది హల్లునకు ద్విత్వము బహుళము.

ఉదా:—వాక్ = వాక్కు, వాకు; స్వరాట్టు = స్వరాటు.

౪౧. మతుబాదికములయు, ముదాదులయు నామము ద్వితీయైకవచనాంతతుల్యము. (శ్రీమంతమ్, గుణవంతమ్, విద్వాంసమ్, అనడ్వాహమ్, ఉపానహమ్, అప్సరసమ్ మొదలైనవి మతుబాదికములు.) ఉదా:—శ్రీమంతము-శ్రీమంతుఁడు, ముదము - ఉపానహము, స్రజము.

౪౨. అకారాంత శబ్దములమీఁద వచ్చు మతుప్ ప్రత్యయము మకారము సాధారణముగ వకారమగు.

ఉదా:—ఆచారవంతుఁడు.

౪౩. ఇకారముమీఁద వచ్చునది సాధారణముగా మకారంబేయగు. ఉదా:—బుద్ధిమంతుఁడు.

౪౪. ఇకారాంతంబులయ్యు మకారోపధకంబులగుచో వానిపై వచ్చు మతుప్ ప్రత్యయము మకారము వకారమే యగును. ఉదా:—రశ్మివంతుఁడు - లక్ష్మీవంతుఁడు.

౪౫. ఋత్విగ్గణమునకు ప్రథమా, ద్వితీయైక వచ నాంతంబులు రెండును నామములగు.

ఉదా:—ప్రథమైకవచనము - ఋత్విక్, ఋత్వికుం-, ద్వితీయైకవచనము-ఋత్విజమ్,-ఋత్విజుఁడు (ఋత్విక్, వణిక్, నీవృత్, మరుత్, పరిక్షిత్, భూభుక్, ఇంద్రజిత్, సత్రా జిత్, విశ్వజిత్, భోగభాక్ ఇది ఋత్విగ్గణము.)

౪౬. విశ్వకర్మాదులకు (స్త్రీ త్వంబగును.)

ఉదా:—విశ్వకర్మా, విశ్వకర్మ; అశ్వత్థామా, అశ్వ త్థామ; యువా, యువ.

౪౭. పుంలింగమై మహాద్వాచకమైన బ్రహ్మశబ్దము స్త్రీసమము. (బ్రహ్మ అను శబ్దమునకు చతుర్ముఖుఁడు, ఋత్వికుం-, విప్రుఁడు, తపము, యోగము అను నర్థములు గలవు.) ఉదా:—(పుంలింగమైన) బ్రహ్మ, (నపుంసకమైన) బ్రహ్మము.

౪౮. ఆత్మ మనిజంతములకును, నకారాంతమనుజ సంజ్ఞలకును స్త్రీత్వము బహుళము.

ఉదా:—ఆత్మా, ఆత్మ, ఆత్మము, ఆత్ముఁడు; అణిమ, అణిమము; మహిమ, మహిమము; గరిమ, గరిమము; లఘిమ, లఘిమము; దేవశర్మ, దేవశర్ముఁడు.

౪౯. పయః ప్రభృతుల సకారమునకు ఉకార ద్విత్వములు నిత్యముగ వచ్చును.

ఉదా:—పయః-పయస్సు, సరః-సరస్సు, పయస్సు, సరస్సు, అంభస్సు, అంహస్సు, మేధస్సు, ఏనస్సు, అయస్సు, అహస్సు, వర్చస్సు మొదలైనవి.

౫౦. మనః ప్రభృతుల సకారమునకు లోపద్విత్వములు వైకల్పికముగనగు.

ఉదా:—మనః - మనస్సు - మనసు - మనము. శిరః - శిరస్సు - శిరసు - శిరము. సదః - సదస్సు - సదసు మొదలైనవి.

౫౧. యశః ప్రభృతుల అంత్యసకారమునకు లోపము వైకల్పికము. ఉదా:— యశస్సు, యశము.

(యశస్సు, తేజస్సు, సదస్సు, ఉరస్సు, వక్షస్సు, ఛందస్సు, అర్చస్సు, రోచిస్సు, ఘనస్సు, మనస్సు, శిరస్సు, చక్షుస్సు, ఆయుస్సు ఇవి యశః ప్రభృతులు)

౫౨. సకారాంత మహద్వాచక శబ్దములకు సకార లోపంబేని ద్వితీయైక వచనాంత తుల్యత్వంబేని అగును. అప్పుడు ప్రత్యయము చేర్చఁబడును.

ఉదా:—అంగిరాః అంగిరుఁడు, అంగిరసుఁడు; ఉగ్రశ్రవాః, ఉగ్రశ్రవుఁడు, ఉగ్రశ్రవసుఁడు; ప్రచేతాః, ప్రచేతుఁడు ప్రచేతసుఁడు.

౫౩. వేధశ్శబ్దము వేధ యనురూపమును, పురోధశ్శబ్దము పురోధ, పురోధసుఁడు అనురూపములను బొందును.

౫౪. ద్యు శబ్దము దివి యనియు, హృచ్ఛబ్దము హృది యనియు రూపములను బొందును. దివి = స్వర్గము, హృది = హృదయము.

# అధ్యాయము 3

## సంధిసూత్రములు

## (అ) సంస్కృత సంధులు

౧. సవర్ణదీర్ఘసంధి:— అ. ఇ. ఉ. ఋ. అను వర్ణములకు అ. ఇ. ఉ. ఋ అను వర్ణములు పరమైన యెడల దీర్ఘ మేకాదేశముగా నగును. (ఏకాదేశమనఁ బూర్వపర స్థానమందలి రెండువర్ణములును బోయి యొకవర్ణమువచ్చుట)

అకారము

ఉదా:—అ + అ = ఆ. దేవ + అగారము = దేవాగారము.
అ + ఆ = ఆ. దేవ + ఆలయము = దేవాలయము.
ఆ + అ = ఆ. లతా + అంతము = లతాంతము.
ఆ + ఆ = ఆ. మహా + ఆనందము = మహానందము.

ఇకారము

ఇ + ఇ = ఈ. హరి + ఇందిర = హరీందిరలు.
ఇ + ఈ = ఈ. కవి + ఈశ్వరుఁడు = కవీశ్వరుఁడు.
ఈ + ఇ = ఈ. మహీ + ఇంద్రుఁడు = మహీంద్రుఁడు.
ఈ + ఈ = ఈ. గౌరీ + ఈశుఁడు = గౌరీశుఁడు.

ఉకారము

ఉ + ఉ = ఊ. భాను + ఉదయము = భానూదయము.
ఉ + ఊ = ఊ. ధేను + ఊధస్యము = ధేనూధస్యము.
ఊ + ఉ = ఊ. వధూ + ఉక్తము = వధూక్తము.
ఊ + ఊ = ఊ. వధూ + ఊరీకారము = వధూరీకారము.

ఋకారణము

ఋ + ఋ = ౠ. పితృ + ఋణము = పితౄణము.

## గుణసంధి

౨. అకారమునకు ఇ ఉ వర్ణములు పరమైనయెడలఁ గ్రమముగా ఏ ఓకారము లేకాదేశములగును.

అ+ఇ = ఏ; దేవ + ఇంద్రుఁడు = దేవేంద్రుఁడు
అ+ఈ = ఏ; దేవ + ఈశుఁడు = దేవేశుఁడు
ఆ+ఇ = ఏ; మహా + ఇంద్రుఁడు = మహేంద్రుఁడు
ఆ+ఈ = ఏ; మహా + ఈశ్వరుఁడు = మహేశ్వరుఁడు

ఓకారము

అ+ఉ = ఓ; చంద్ర + ఉదయము = చంద్రోదయము
అ+ఊ = ఓ; దేవ + ఊర్జితము = దేవోర్జితము
ఆ+ఉ = ఓ; మహా + ఉదయము = మహోదయము
ఆ+ఊ = ఓ; రమా + ఊరీకారము = రమోరీకారము

3. అకారమునకు ఋ వర్ణంబు పరంబగుచో అర్ అనునది వైకల్పికంబుగ నేకాదేశమగు.

ఉదా:— దేవ+ఋషి = దేవర్షి, దేవఋషి. వసంత + ఋతువు = వసంతర్తువు, వసంతఋతువు.

## వృద్ధిసంధి

౪. అకారమునకు ఏ, ఐ లు, ఓ, ఔ లు, పరమైనయెడల ఐ ఔ వర్ణములు క్రమముగా నేకాదేశమగును.

ఐకారము

అ + ఏ = ఐ; కృష్ణ + ఏకత్వము = కృష్ణైకత్వము

ఆ + ఏ = ఐ; ప్రజా+ ఏకీభావము=ప్రజైకీభావము

అ + ఐ = ఐ; సర్వ + ఐశ్వర్యము=సర్వైశ్వర్యము

ఆ + ఐ = ఐ; మహా+ ఐశ్వర్యము=మహైశ్వర్యము

ఔకారము

అ + ఓ = ఔ; దేవ + ఓకస్సు=దేవౌకస్సు

ఆ + ఓ = ఔ; మహా+ఓఘము=మహౌఘము

అ + ఔ=ఔ; సర్వ+ఔత్సుక్యము=సర్వౌత్సుక్యము

ఆ + ఔ=ఔ; మహా+ఔత్కంఠ్యము = మహౌత్కంఠ్యము.

యణాదేశసంధి

౫. ఇక్కులకు సవర్ణముకాని యచ్చు పరమగుచో వరుసగా య ణ్ణు లాదేశములగును.

(ఇక్కులు—ఇ. ఉ. ఋ. ఌ)

(యణ్ణులు:—య. వ. ర. ల)

ఉదా:- ఇ + అ=య; గిరి + అగ్రము=గిర్యగ్రము.

ఇ + ఆ=యా; అతి + ఆశ్చర్యము=అత్యాశ్చర్యము

ఇ + ఉ=యు; అతి + ఉగ్రము=అత్యుగ్రము

ఉ + అ=వ; మధు +అరి=మధ్వరి.

ఋ + అ=ర; పితృ + అంశము=పిత్రంశము

## పరరూపసంధి

౬. సారంగాదులయందుఁ బరరూపము బహుళముగ నగును.

ఉదా:—సార + అంగము = సారంగము; కుల + అట = కులట; మార్త + అండుఁడు = మార్తండుఁడు (మార్తాండుఁడు); బింబ + ఓష్ఠము = బింబోష్ఠము (బింబౌష్ఠము.)

## సకారాంతసంధి

౭. సకార తవర్గములకు శవర్ణ చవర్గములు పరమగుచోఁ గ్రమముగా శవర్ణ చవర్గము లాదేశంబగు.

ఉదా:—దుస్ + శకునము = దుశ్శకునము
సత్ + చరితము = సచ్చరితము

౮. చ, ఛ వర్ణములు పరమైన సకారమునకు శ వర్ణమగు. ఉదా:—మనస్ + చలనము = మనశ్చలనము.

౯. పదాంత సకారమునకు క, ఖ, లు పరమగుచో జిహ్వామూలీయమును ప, ఫ, లు పరమగుచో ఉపధ్మానీయమును వచ్చును.

ఉదా:— మనస్ + కమలము = మనఃకమలము; తపస్ + ఫలము = తపఃఫలము.

(కకార పకారములకు ముందున్న విసర్గములు వరుసగా జిహ్వామూలీయము ఉపధ్మానీయ మనఁబడును).

౧౦. ఇస్, ఉస్ అంతమందుఁగల శబ్దములకు క, ఖ, ప, ఫ, వర్ణములు పరమైన షకారము వచ్చును.

ఉదా:—దుస్ + కరము = దుష్కరము - బహిస్ + కారము = బహిష్కారము.

౧౧. క్షకారము పరమగుచో సకారమునకు విసర్గము నిత్యముగానగు.

ఉదా:—మనస్ + క్షోభము = మనఃక్షోభము.

౧౨. సకారమునకు ష - ట వర్గములు పరమైనచో షకారమువచ్చును.

ఉదా:—చతుస్ + షష్ఠి = చతుష్షష్ఠి, అయస్ + టంకము=అయష్టంకము.

౧౩. అసంతములకు (హ్రస్వాకార పూర్వక సాంతంబులకు) అకారము పరంబగుచో ఓకారం బేకాదేశంబగు.

ఉదా:—మనస్+అభిలాష=మనోభిలాష, దాసస్+అహం=దాసోహం.

౧౪. అసంతముల సకారమునకు వర్గ తృతీయ చతుర్థ పంచమ వర్ణంబులును, అంతస్థములును హకారమును బరంబగునపుడు ఓకారంబగు.

ఉదా:— మనస్ + నాథుఁడు = మనోనాథుఁడు ; తపస్ + ధర్మము=తపోధర్మము; సరస్ + రుహము=సరోరుహము; మనస్ + హరుఁడు = మనోహరుఁడు.

మఱికొన్ని సకారాంతపదముల సంధిరూపములు:—

ధనుస్ + అగ్రము = ధనురగ్రము
ధనుస్ + ధరుఁడు = ధనుర్ధరుఁడు
అంతస్ + గతము = అంతర్గతము

స్వస్ + రాజ్యము = స్వరాజ్యము
భాస్ + కరుఁడు = భాస్కరుఁడు
మనస్ + చలనము = మనశ్చలనము
ధనుస్ + టంకారము = ధనుష్టంకారము
మనస్ + శాంతి = మనశ్శాంతి
సరస్ + షండము = సరష్షండము

హల్సంధి

౧౫. క చ ట త ప లకు అచ్చులును సరళాదులగు కొన్ని హల్లులు పరమగుచో యథాక్రమముగా సరళాదేశములగు.

ఉదా:—వాక్ + ఈశుఁడు = వాగీశుఁడు; దిక్ + గజము = దిగ్గజము; అచ్ + అంతము = అజంతము; సుప్ + అంతము = సుబంతము.

౧౬. తకారమునకు జ, ఝ లు పరమగుచో జకారము వచ్చును.

ఉదా:—సత్ + జాతి = సజ్జాతి, సత్ + ఝరము = సజ్ఝరము.

౧౭. త కారమునకు ల కారము పరంబగుచో లకారం బాదేశంబగును.

ఉదా:—తత్ + లలన = తల్లలన, తత్ + లత = తల్లత,

౧౮. త వర్ణమునకు చ, ఛ, శ - వర్ణములు పరంబగునపుడు చకారం బాదేశంబగు:—

ఉదా:— మరుత్ + చలనము = మరుచ్చలనము; లసత్ + శాంతి = లసచ్ఛాంతి.

౧౯. ఛ కారము పరంబగుచో హ్రస్వమునకు నిత్యముగాను, దీర్ఘంబునకు వైకల్పికముగాను 'తు' గాగమ మగు. ఉదా:—వన + ఛేదము = వనచ్ఛేదము.

౨౦. హల్లునకు అనునాశికంబు పరంబగుచో ననునాశికంబు వైకల్పికంబుగనగు.

ఉదా:—వాక్ + మాధుర్యము = వాఙ్మాధుర్యము.

హలంతశబ్దములపై హల్లు పరమైనపు డేర్పడు కొన్ని రూపములు:—

తత్ + టీక = తట్టీక

దిక్ + గజము = దిగ్గజము

చిత్ + రూపము = చిద్రూపము

తరు + ఛాయ = తరుచ్ఛాయ

లక్ష్మీ + ఛాయ = లక్ష్మీచ్ఛాయ, లక్ష్మీఛాయ

గీర్ + పతి = గీఃపతి, గీష్పతి

పుమ్ + పౌత్రుఁడు = పుంస్పౌత్రుఁడు

పుమ్ + ప్లవంగము = పుంస్ప్లవంగము

పుమ్ + తేజము = పుంస్తేజము

పుమ్ + చైతన్యము = పుంశ్చైతన్యము

పుమ్ + చ్యుతి = పుంశ్చ్యుతి

పుమ్ + టిట్టిభము = పుంష్టిట్టిభము.

## (ఆ) తెనుఁగు సంధులు

౨౧. పదము లొకటితో నొకటి చేరునపుడు కలుగు రూపభేదము సంధియనఁబడును (సంధి యనఁగా కలయిక). ఇది అచ్సంధి, హల్సంధి యని రెండు విధములు.

## అచ్సంధి

౨౨. మొదటిపదము తుది యచ్చు లోపించి యచట రెండవ పదముయొక్క మొదటియచ్చు నిల్చుట అచ్సంధి యనఁబడును.

౨౩. తెనుఁగుభాషయందు అ. ఇ. ఉ మీఁద నచ్చు వచ్చిననే సంధియగును.

ఉదా:—అకారమునకు - మేన + అత్త = మేనత్త.

ఇకారమునకు - సేవించితివి + అయ్యా = సేవించితివయ్యా.

ఉకారమునకు - రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు.

౨౪ దీర్ఘాచ్చులకు సంధి కాదు.

౨౫. సంధి లేనిచోట స్వరంబుకంటెఁ బరంబైన స్వరంబునకు యడాగమంబగు.

ఉదా:—మా + అమ్మ = మాయమ్మ.

## అకారసంధి

౨౬. అకారమున కచ్చుపరమైన సంధిబహుళము.

బహులమనఁగా:—౧. సంధి నిత్యముగా నగుట;

౨. సంధియై యొకరూపము, సంధిరాక మఱియొక రూపము వచ్చుట ; ౩. సంధిరాకుండుట ; ౪. సూత్రమునఁ దెలిసిన దానికంటె నన్యము వచ్చుట.

౨౭. మేన లోనగు శబ్దములకు సంధి వైకల్పికము.

ఉదా :—మేన + అత్త = మేనత్త (సంధియగుట) మేనయత్త (యడాగమ మగుట).

౨౮. నామంబుల తుది అకారమునకు శ్రేష్ఠవాచకంబులగు అన్నాదులు, ఆకు శబ్దంబును పరమగుచో సంధి నిత్యము.

(అన్న, అయ్య, అక్క, అమ్మ, అప్ప, ఆయి, అవ్వ, అన్నాదులు)

ఉదా :—రామ + అన్న = రామన్న ; రామ + అయ్య = రామయ్య; భీమ + అక్క = భీమక్క; రంగ + అమ్మ = రంగమ్మ; రామ + అప్ప = రామప్ప; సీత + ఆయి — సీతాయి; రంగ + అవ్వ = రంగవ్వ; చింత+ఆకు చింతాకు.

౨౯. స్త్రీ వాచక, తత్సమ, సంబోధన, అవధారణంబులకు సంధి లేదు.

ఉదా:-స్త్రీవాచకమునకు:-అమ్మ + ఎక్కడ=అమ్మయెక్కడ
తత్సమమునకు:-హంస + ఏది=హంసయేది.
సంబోధనమునకు:-రాముఁడ + ఇది యేమి= రాముఁడ యిది యేమి.
అవధారణమునకు :—నీవ + అంటివి=నీవ యంటివి.

## ఇకారసంధి

30. ఇకారాంత నామవాచకములకు అన్నాదులు పరమైనపుడు సంధి తఱచుగనగు.

ఉదా:—లక్ష్మి + అమ్మ = లక్ష్మమ్మ; రెడ్డి+అన్న = రెడ్డన్న; జానకి+అయ్య = జానకయ్య; కోమటి + అక్క = కోమటక్క; దాసరి + అప్ప=దాసరప్ప.

31. మధ్యమపురుష ఇకారమునకు సంధి నిత్యము.

ఉదా:- సేవించితివి+అచ్యుతుని=సేవించితి వచ్యుతుని

32. ప్రథమోత్తమపురుషక్రియలయొక్కయు,ఏమ్యాదులయొక్కయు ఇకారమునకు సంధి వైకల్పికము.

(ఏమి, మఱి, కి, (షష్ఠి), అది, అవి, ఇది, ఇవి, ఎది, ఏది, ఎవి, ఏవి, ఇవి ఏమ్యాదులు. ఇదియాకృతిగణము.)

ఉదా:—ప్రథమపురుష :—వచ్చిరి + అసురులు = వచ్చి రసురులు, వచ్చిరి యసురులు.

ఉత్తమపురుష:—వచ్చితిమి+ఇచటికి=వచ్చితి మిచటికి వచ్చితిమి యిచటికి.

ఏమ్యాదులు:—ఏమి + అంటివి = ఏమంటివి; ఏమి యంటివి. అది + ఏమి = అదేమి; అదియేమి మఱి + ఏమి = మఱేమి; మఱి యేమి.

33. క్త్వార్థంబైన ఇకారమునకు సంధి లేదు.

ఉదా:—చూచి + ఆడెను = చూచియాడెను.
వచ్చి + అడిగె = వచ్చియడిగె.

## ఉకారసంధి

౩౪. ఉకారమున కచ్చు పరమైన సంధినిత్యము.

ఉదా:—రాముఁడు + అతఁడు = రాముఁడతఁడు; రాఁడు + అతఁడు = రాఁడతఁడు.

౩౫. ప్రథమేతర విభక్తి, శత్రర్థక చు వర్ణముల ఉకారమున కచ్చుపరమైన సంధి వైకల్పికము.

ఉదా:—నన్నున్ + అడిగె = నన్నడిగె; నన్ను నడిగె.
నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె; నాకొఱకు నిచ్చె.
నాకున్ + ఇచ్చె = నాకిచ్చె; నాకునిచ్చె.
ఎందున్ + ఉంటివి = ఎందుంటివి; ఎందునుంటివి.
చేయుచున్ + ఉండె = చేయుచుండె; చేయుచునుండె.

౩౬. రూపాంతరమందు ద్విత్వములేని శబ్దముల ఉకారమున కచ్చు పరమైనపుడు సంధి లేదు.

నన్ను (రూ) నను. (నిను, తను, తము, మము, మిము)

ఉదా:—నను + ఏలె = ననునేలె; తము + అడిగె = తమునడిగె. (ననేలె-తమడిగె - అను రూపములు చేయరాదు.)

౩౭. వాక్యావసానమున సంధిలేమి దోషముగాదు.

ఉదా:— రాముఁడు మంచివాఁడు-అతని నమ్ముటమేలు.

౩౮. ఏసి, ఎఁడు మొదలగు ప్రత్యయములు పరంబగునపు డన్ని యచ్చులకు సంధియగును.

ఉదా:—తొమ్మిది + ఏసి = తొమ్మిదేసి, తట్ట + ఎఁడు = తట్టెఁడు.

౩౯. పదమధ్యస్వరంబులకు సంధి బహుళము.

ఉదా:—రాముల + అందు = రాములందు; రాముల యందు. ఎనిమిది + అవ = ఎనిమిదవ; ఎనిమిదియవ. గంప + అంత = గంపంత; గంపయంత.

ద్రుతప్రకృతిక సంధి

౪౦. ద్రుతమున కచ్చు పరమైనపు డేర్పడునది ద్రుత ప్రకృతిక సంధి. ఉదా:-చూచెన్ + అతఁడు = చూచెనతఁడు.

౪౧. ఇఁకాదులకుఁదప్ప ద్రుత ప్రకృతికముల కచ్చు పరమైనపుడు సంధిలేదు. ఇఁకాదులకు వైకల్పికము.

ఉదా:—ఇఁకన్ + ఏమి = ఇఁక నేమి, ఇఁ కేమి.

౪౨. ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగును.

ఉదా:—

చూచెను + కంజాక్షుఁడు = చూచెను గంజాక్షుఁడు.
కాసెను + చంద్రిక = కాసెను జంద్రిక.
చేసెను + టక్కులు = చేసెను డక్కులు.
కోసెను + తలిరులు = కోసెను దలిరులు.
కూసెను + పక్షులు = కూసెను బక్షులు.

౪౩. ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు - పక్షంబున స్వత్వంబగు.

సంశ్లేష = మీఁది హల్లుతోఁ గూడుట.
స్వత్వము = ద్రుతము స్వస్వరూపముతో నుండుట.

ఉదా:—

పూర్ణబిందువు - చూచెం గంజాక్షుఁడు.

అర్ధబిందువు - చూచెఁ గంజాక్షుఁడు.

సంశ్లేష - చూచె న్గజాక్షుఁడు.

స్వత్వము - చూచెను గంజాక్షుఁడు.

౭౭. ద్రుతమునకు సరళములు, స్థిరములు పరమైనపుడు లోప సంశ్లేష విభాష నగును.

ఉదా:—

వచ్చెను + గోవులు { వచ్చెగోవులు-(లోపము) / వచ్చెన్గోవులు-(సంశ్లేష) / వచ్చెనుగోవులు-(స్వత్వము) }

మెఱసెను + ఖడ్గము { మెఱసెఖడ్గము-(లోపము) / మెఱసెన్ఖడ్గము-(సంశ్లేము) / మెఱసెనుఖడ్గము-(స్వత్వము) }

౭౮. వర్గయుక్సరళంబులు పరంబులగునపుడు ద్రుతమునకు లోప, స్వత్వ, సంశ్లేషములే కాక కొన్ని తావులఁ బూర్ణబిందువును గానంబడియెడి, ఉదా:—

| | సరళములు | వర్గయుక్కులు |
|---|---|---|
| లోపము:— | వచ్చెజలజాక్షుఁడు, | చచ్చె ధాత్రీపతి |
| స్వత్వము: — | వచ్చెనుజలజాక్షుఁడు, | చచ్చెను ధాత్రీపతి |
| సంశ్లేషము:— | వచ్చెన్జలజాక్షుఁడు | చచ్చె న్ధాత్రీపతి |
| పూర్ణబిందువు:— | వచ్చెంజలజాక్షుఁడు, | చచ్చెం ధాత్రీపతి |

౭౯. తాను నేను పదముల ద్రుతమునకు సంశ్లేషము లేదు. ఉదా:—తాను + చదివె = తాఁజదివె, తానుజదివె.

తాను + విని = తావిని — తాను విని, దీర్ఘముమీఁదిది గాన నిచ్చటి ద్రుతమునకు సాధ్యపూర్ణము లేదు)

౪౭. కొన్ని యెడల ద్రుతము మీఁద ద్రుతము కానంబడియెడి. ఉదా:—అదియు న్గాక దినంబునఁ బోలె

౪౮. వాక్యావసానంబున ద్రుతమునకేని ద్రుతస్వరంబునకేని లోపము బహుళముగా నగును.

ఉదా:—వాఁడు వచ్చెను, వాఁడు వచ్చె, వాఁడు వచ్చెఁ.

(బహుళగ్రహణముచే వచ్చుచున్నాను లోనగువానికి ద్రుతలోపముగాని ద్రుతస్వరలోపముగాని యుండదు.)

గ. స. డ. ద. వాదేశసంధి

౪౯. ప్రథమావిభక్తికిని, అవ్యయములకును, గళలగు క్రియలకును, బరమగు పరుషములకు గ. స. డ. ద. వ. లు బహుళముగా నగును.

ఉదా:—

వాఁడు + కొట్టె = వాఁడు గొట్టె
మనము + చూచితిమి = మనము సూచితిమి
నీవు + టక్కరివి = నీవు డక్కరివి
మీరు + తలఁగుఁడు = మీరుదలఁగుడు
అతఁడు + పలికె = అతఁడు వలికె
ఏమి + చెప్పితివి = ఏమి సెప్పితివి
రావు + కదా = రావుగదా.

౫౦. ద్వంద్వంబునం బదంబుమీఁది పరుషములకు గ స డ ద వ లగు. ఉదా:—తల్లిదండ్రులు - కాలుసేతులు.

౫౧. తెలుఁగులమీఁది సాంస్కృతిక పరుషములకు గ స డ ద వలు సాధారణముగా రావు.

ఉదా:—వాఁడు కంసుఁడు; వీఁడు చక్రధరుఁడు.

ఆమ్రేడితసంధి (Reduplication)

౫౨. ఒకే పదమును రెండుమారు లుచ్చరించినచో నందు రెండవమా ఉచ్చరింపఁబడిన పదమున కామ్రేడిత మనిపేరు.

౫3. ఆమ్రేడితము పరమగునపు డన్నియచ్చులకు సంధియగును.

ఉదా:—అహో + అహో = అహోహో
ఔరా + ఔరా = ఔరౌరా
ఓహో + ఓహో = ఓహోహో
ఏమి + ఏమి = ఏమేమి.

౫౪. ఆమ్రేడితము పరంబగునపుడు కడాదుల తొలి యచ్చు మీఁది వర్ణంబులకెల్ల నదంతమగు ద్విరుక్త టకార మగును.

ఉదా:—కడ + కడ = కట్టకడ
ఎదురు + ఎదురు = ఎట్టఎదురు
కొన + కొన = కొట్టకొన
నడుము + నడుము = నట్టనడుము

పగలు + పగలు=పట్టపగలు
పిడుగు + పిడుగు=పిట్టపిడుగు
మొదలు + మొదలు=మొట్టమొదలు

౫౫. ఆమ్రేడితము పరంబగునపుడు విభక్తికి లోపము బహుళముగా నగును.

ఉదా:—

అప్పటికిన్ + అప్పటికిన్=అప్పటప్పటికిన్, అప్పటి కప్పటికిన్
దినము + దినము=దినదినము, దినము దినము.
ఊరన్ + ఊరన్ = ఊరూరన్, ఊరనూరన్.

౫౬. ఆమ్రేడితమునం దించుక, నాఁడు మొదలైన వాని కంతిమాక్షర లోపము బహుళముగానగును.

ఉదా:—ఇంచుక + ఇంచుక=ఇంచించుక.
నాఁడు + నాఁడు=నానాఁడు.
లోపల + లోపల=లోలోపల.
లోన + లోన=లోలోన.

౫౭. అందదుకు లోనగునవి యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

ఉదా:—అదుకు + అదుకు=అందదుకు.
ఇంకులు + ఇంకులు=ఇట్టింకులు.
చెదరు + చెదరు=చెల్లాచెదరు, చెల్లచెదరు.
ముడుఁగు + ముడుఁగు=ముచ్చముడుఁగు.
ఆఁక + ఆఁక=అట్టాఁక.
చప్పుకము + చప్పుకము=చచ్చప్పుకము.

మిట్టు + మిట్టు = మిఱుమిట్టు.
తునియ + తునియ = తుత్తునియ.
తుమురు + తుమురు = తుత్తుమురు.
ఆఁకలి + ఆఁకలి = అట్టాఁకలి.
త్రాగు + త్రాగు = తప్పత్రాగు.
కదలు + కదలు = క్రక్కఁదలు.

౫౮. ఆమ్రేడితము పరంబగునపుడు కృతకహ్రస్వంబునకు దీర్ఘంబగును.

ఉదా:— లెమ్ము + లెమ్ము = లేలెమ్ము, లేలే.
రమ్ము + రమ్ము = రారమ్ము, రారా.
పొమ్ము + పొమ్ము = పోపొమ్ము, పోపో.

౫౯. ఆమ్రేడితము పరంబగునపుడు మధ్యమము, డు లకు లోపము విభాషనగును.

ఉదా:— ము లోపము. ఉండుము + ఉండుము = ఉండుండుము.
లోపింపక ,, ,, ఉండుముండుము
డు లోపము. కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు
లోపింపక ,, ,, కొట్టుఁడు కొట్టుడు

౬౦. నిందయం దామ్రేడితము మొదలి హ్రస్వదీర్ఘాక్షరములకు గిగీలగును.

ఉదా:— భీముఁడు గీముఁడు, కుంభకర్ణుఁడు గింభకర్ణుఁడు

## సమాస సంధులు

౬౧. సమాసమున కుఱు - చిఱు - కడు - నడు - నిడు శబ్దముల ఱ. డ ల కచ్చుపరమైన ద్విరుక్త ట కారమగును.

ఉదా :—కుఱు + ఉసురు = కుట్టుసురు
చిఱు + ఎలుక = చిట్టెలుక
కడు + ఎదురు = కట్టెదురు
నడు + ఇల్లు = నట్టిల్లు
నిడు + ఊరుపు = నిట్టూరుపు

౬౨. సమాసంబున ద్రుత ము న కు లోపమగును. ఉదంత తద్ధర్మార్థక విశేషణముదప్ప నెట్టి ద్రుతప్రకృతిక మైనను విశేషణమైనచోఁ గళయగును.

ఉదా :—ఎల్లన్ + పాపములు = ఎల్లపాపములు.

౬౩. కర్మధారయములందు ము వర్ణకము న కు "పు, ంపు" లగును.

ఉదా :—సరసము + పలుకు = సరసపుఁబలుకు,
సరసంపుఁబలుకు,

౬౪. సమాసంబుల నుకారాంత స్త్రీసమంబులకును, పు, ంపు లకును, పురుష సరళములు పరములగునపుడు నుగాగమ మగును.

ఉదా :—
అర్ధబిందువు :—సరసపుఁబలుకులు, సరసంపుఁబలుకులు.
పూర్ణబిందువు :—సరసపుంబలుకులు; సరసంపుంబలుకులు.
సంశ్లేషము :—సరసపున్బలుకులు, సరసంపున్బలుకులు.
లోపము :—ఉన్నతపుగోడుగు, ఉన్నతంపుగోడుగు.
పూర్ణబిందువు :—ఉన్నతపుంగోడుగు, ఉన్నతంపుంగోడుగు.
సంశ్లేషము :—ఉన్నతపున్గోడుగు, ఉన్నతంపున్గోడుగు.

౬౧. సమాసములందు ద్రుతమునకు స్వత్వము లేదు.

ఉదా:—అలరును + జొంపములు = అలరుజొంపములు, అలరుంజొంపములు, అలరుఞ్జొంపములు.

౬౬. త ల ( బ్రా లు లోనగు నలుక్సమాసంబుల ద్రుతంబునకు లోపము లేదు.

విభక్తి ప్రత్యయము లోపింపకుండిన నలుక్సమాసమగును.)

ఉదా:—తలన్ + ప్రాలు = తలఁబ్రాలు
ఊరన్ + పంది = ఊరఁబంది
ఒల్లన్ + పాటు = ఒల్లఁబాటు
సేసన్ + ప్రాలు = సేసఁబ్రాలు

౬౭. షష్ఠీసమాసమం దుకార ఋకారముల కచ్చు పరమైనపుడు నుగాగమ మగును.

ఉదా:—రాజు+ఆజ్ఞ = రాజు నాజ్ఞ
విధాతృ+ఆనతి = విధాతృనానతి

౬౮. ఉకారాన్త స్త్రీసమంబులకును, పు, ంపు లకును. అకారాంత గుణవాచకములకును తనంబు పరంబగునపుడు నుగాగమ మగును.

ఉదా:—ఉకారాంత స్త్రీ సమములు:—సొగసుఁదనము, సొగసుందనము, సొగసుద్దనము.

పు. ంపు లు:—సరసపుఁదనము; సరసపుందనము, సరసపుద్దనము, సరసంపుఁదనము, సరసంపుందనము, సరసంపుద్దనము.

అకారాంత గుణవాచకములు:— చక్కఁదనము; చక్కందనము, చక్కన్దనము.

౧౯. సమాసంబులఁ బ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగ నగును.

ఉదా:— లేఁత + దూడ = లేదూడ, లేఁతదూడ.
పూవు + బంతి = పూఁబంతి, పూవుబంతి

౨౦. లుప్తశేషములకుఁ బరుషంబులు పరంబు లగునపుడు నుగాగమ మగును.

ఉదా:— ప్రాఁత + కెంపు = ప్రాఁగెంపు
లేత + కొమ్మ = లేఁగొమ్మ
పూవు + తోఁట = పూఁదోట
వేఁగు + పోక = వేఁబోక.

౨౧. క్రొత్త, కెంపు శబ్దముల కాద్యక్షరశేషంబులకుం గొన్నియెడల నుగాగమంబును, గొన్నియెడల మీఁది హల్లునకు ద్విత్వంబును బహుళముగ నగును. అద్యక్షరశేష మనఁగా మొదటి యక్షరము మిగిలినది.)

ఉదా:— నుగాగమము:— క్రొత్త+చాయ=క్రొంజాయ క్రొత్త+పువ్వు=క్రొంబువ్వు, కెంపు + చిగురు = కెంజిగురు.

మీఁది హల్లునకు ద్విత్వము:— క్రొత్త + కారు = క్రొక్కారు; కెంపు + మోవి = కెమ్మోవి.

౨౨. అచ్చు పరంబగుచోఁ విశేషణంబులయిన పెన్వాధుల కడ హల్లునకు ద్విత్వంబగు

ఉదా:—పెను + ఉరము = పెన్నురము
పలు + అఱపులు = పల్లఱపులు

౨౩. సమాసంబుల నుగాగమలోప ద్విత్వంబు లన్య శబ్దంబులమీఁదను గానంబడెడి.

ఉదా:—పది + తొమ్మిది = పందొమ్మిది.
సగము + కోరు = సంగోరు.
వంక + చెఱఁకు = వంజెఱకు.
నెఱ + మనము = నెమ్మనము.

టుగాగమసంధి

౨౪. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరమగుచో టుగాగమము బహుళంబుగ నగును.

ఉదా:—ముద్దు + ఉంగరము = ముద్దుటుంగరము
నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము
మదము + ఏనుఁగు = మదపుటేనుఁగు.

౨౫. పేర్వాదుల కచ్చు పరమగుచో టుగాగమము విభాషనగును.

ఉదా:—పేరు + ఉరము = పేరుటురము, పేరురము
తప్పు + అడుగు = తప్పుటడుగు, తప్పడుగు
చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు.
పొదరు + ఇల్లు = పొదరుటిల్లు, పొదరిల్లు.

౨౬. ఈకార్య మనుదంతములకుఁగూడ గానంబడియెడి.

ఉదా: —దుక్కి + ఎద్దు=దుక్కిటెద్దు

మిద్దె + ఇల్లు=మిద్దెటిల్లు

తేనె + ఈఁగ=తేనెటీఁగ

౭౭. కర్మధారయంబునం దత్సమంబులకు 'ఆలు' శబ్దము పరమైనపు డత్వమున కుత్వంబును రుగాగమంబు నగును.

ఉదా: —ధీర+ఆలు = ధీరురాలు; గుణవంత+ఆలు— గుణవంతురాలు.

౭౮. పేదాది శబ్దముల కాలుశబ్దము పరమగునపుడు రుగాగమంబగు, నుత్వంబురాదు.

ఉదా: —పేద+ఆలు = పేదరాలు; బీద + ఆలు = బీదరాలు.

(పేద, బీద, ముద్ద, బాలింత, కొమ, జవ, అయిదవ, మనుమ, గొడ్డు; ఇట్టివి పేదాదులు.)

౭౯. ఆ. ఈ. ఏ. త్రికము; త్రికముమీఁది యసంయుక్తములగు కొన్ని హల్లులకు ద్విత్వంబును, త్రికదీర్ఘంబునకు హ్రస్వంబును విభాషనగు.

ఉదా: —ఆ + మగువ = అమ్మగువ — ఆ మగువ ఈ + కాలము=ఇక్కాలము-ఈకాలము; ఏ + పని=ఎప్పని; ఏపని. (కొన్ని హల్లుల కనుటచే రేఫ శ, ష, స, హ ల, క్ష, కార్యముగాదు.)

౮౦. సమాసమున నాము మొదలగు శబ్దముల ము వర్ణమునకు బిందుపూర్వక ప వర్ణమును, కనుము మొదలగు శబ్దముల ము వర్ణమునకు ప వర్ణమును వచ్చును.

నామ్వాది:—ఉదా:-నాము + చేను = నాఁపచేను, పాము + తేఁడు = పాపఁతేఁడు; అమ్ము + శయ్య = అంప శయ్య.

కనుమ్వాది—ఉదా:—కనుము + గడ్డి=కనుపగడ్డి; జనుము+నార=జనపనార, ఇనుము + మేకు = ఇనుపమేకు.

(నాము, పాము, ప్రేము, వేము, అమ్ము, ఎమ్ము మొదలైనవి నామ్వాదులు.)

(కనుము, ఇనుము, ఎనుము, మినుము, జనుము, మొదలైనవి కనుమ్వాదులు.)

౮౧. అది, అవి అనుపదముల అకారమునకు సమాసంబున లోపంబు బహుళంబుగానగు.

ఉదా :—నా + అది=నాది; నాయది; నీ + అవి=నీవి, నీయవి.

౮౨. అది అవి శబ్దంబుల అకారమునకు ఇదంతతద్ధర్మార్థక విశేషణంబుల మీఁద లోపంబు నిత్యంబు. ఉదంత తద్ధర్మార్థక విశేషణములమీఁద లోపము లేదు.

ఉదా :—ఇ. త. వి. { వచ్చెడి + అది = వచ్చెడిది. / పోయెడి + అవి= పోయెడివి.

ఉ. త. వి. {
వచ్చు + అది = వచ్చునది.
వచ్చు + అవి = వచ్చునవి.
వచ్చెడు + అది = వచ్చెడునది.
వచ్చెడు + అవి = వచ్చెడునవి.

౮౩. హల్లు పరమగునపుడు అను, కొను, చను లోనగు క్రియలవలనఁ గలిగిన విశేషణముల కడపటి ఉకారము వైకల్పికముగ లోపించును.

ఉదా:- గరుడుఁడను + వాఁడు = గరుడుఁడన్వాఁడు
పెనఁగొను + గొలుసు = పెనఁగొన్ గొలుసు
ఒకఁడుచను + త్రోవ = ఒకఁడుచన్ త్రోవ

౮౪. కర్మధారయంబునఁ బదంబుపై పరుషములకు గ స డ ద వలు వైకల్పికముగ నగును.

ఉదా:—ఏ + చుట్టములు = ఏసుట్టములు
పెద్ద + కాలము = పెద్దగాలము.

౮౫. షష్ఠీ సమాసమందలి 'ని ల' ల యచ్చులకు లోపము వైకల్పికముగ నగును.

ఉదా:—ఇంద్రుని + వలె = ఇంద్రున్వలె, ఇంద్రునివలె;
బింబముల + రుచుల్ = బింబముల్ రుచుల్,
బింబముల రుచులు.

౮౬. సమాసంబులఁ జేత, తోడ, వలన ల కిత్వంబగును.

ఉదా:—నీచేత + కూడు = నీచేతికూడు, నాతోడ + చెలిమి = నాతోడిచెలిమి, వానివలన + కీడు = వానివలనికీడు.

౮౭. అందు మొదలగువానికి అలి అనునది సమాసములనగు. ఉదా:—నాయందుర్ + ఆశ=నాయందలియాశ,
ఎందుర్ + కాయలు = ఎందలికాయలు.

౮౮. పడ్వాదులు పరంబగునపుడు ము వర్ణకమునకు లోప పూర్ణబిందువులు విభాషనగును.

ఉదా:— శ్రమము + పడు = శ్రమపడు - శ్రమంపడు - శ్రమముపడు. (పడు = పొందు)

౮౯. మధ్యమపురుష ము వర్ణకమునకు హల్లు పరమైనఁగాని అవసానమునఁగాని లోపము విభాషనగును.

ఉదా :— చూడుము + నన్ను = చూడు నన్ను, చూడుమునన్ను, నన్నుఁజూడు, నన్నుఁజూడుము.

(అచ్చు పరంబగుచో లోపమురాదు. చూడుము + అనియె = చూడుమనియె.)

౯౦. వ్యతిరేక మధ్యమ ము వర్ణకమున కెల్లచో లోపము విభాషనగు - (ఎల్లచో ననఁగా అచ్చు పరమైనప్పుడుకూడ ననిభావము.)

ఉదా:—నమ్మకుము + ఇతని = నమ్మకితని, నమ్మకుమితని.

౯౧. ధ్వనిని వెల్లడించు పదములు రెండు, మూడు, వాడ నగును.

ఉదా:—భుగ భుగ, గడ గడ గడ. తళ తళ తళ.

సూ౨. ధ్వన్యనుకరణమునకు అను ధాతువుపరమైనపుడు కొన్నియెడల ముగాగమ మగును.

ఉదా:—సల సల + అని=సల సల మని.
కన కన + అని=కన కన మని.

సూ3. అనుధాతువు పరమైనపుడు తుదిహల్లునకు ద్విత్వ మగును.

ఉదా:—భామ్ + అని = భామ్మని.
పటిల్ + అని = పటిల్లని.

సూ౪. సమాసమునం దుత్తరపదము పరంబగునపుడు మూఁడు శబ్దముయొక్క డు వర్ణమునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వమునునగును. (మిశ్రద్విగువునకుఁ బ్రాయికముగ నేకవచనమగు)

ఉదా:—మూఁడు + కోణము = ముక్కోణము.
మూఁడు + తోవ = ముత్తోవ.

సూ౫. అను కరణమున విసర్గమునకు లోపంబగును.

ఉదా:—త్వమేవగతిః + అనె = త్వమేవగతియనె.

సూ౬. ఉదంతనామంబునకు అనుకరణంబున వుగాగమంబగు.

ఉదా:—అయం విష్ణుః + అనె = అయం విష్ణువనె.

సూ౭. అనుకరణమునఁ దుదిహల్లునకు ద్విర్వచనంబగు.

ఉదా:—కింతత్ + అనియె = కింతత్తనియె.

౯౮. అహమాదులమకారమునకు ద్విరుక్తి విభాషనగు.

ఉదా:—దాసో౽హమ్+అనియె=దాసోహమ్మనియె-దాసోహమనియె.

౯౯. బహువచన లు వర్ణకమునకు ఉకారలోపము వైకల్పికము.

ఉదా:—జనుల్ మెత్తురే, మెత్తురేజనుల్.

౧౦౦. నా నీ తన శబ్దములకు సమాసమున దు వర్ణము వైకల్పికముగా నగును.

ఉదా:—నాభాగ్యము = నాదుభాగ్యము, నీపుణ్యము= నీదుపుణ్యము; తనమాట = తనదుమాట.

౧౦౧. ఎ. ఏ. ఒ. ఓ అనుప్రయుక్తంబులగు నపుడు మధ్యమపురుష ము, డు, ఋ లకు వు, రు, లగు. అప్పుడు ముందున్న ఉత్తున కత్వంబగు.

ఉదా:—చూడుము + ఎ = చూడవె

చూడుము + ఏ = చూడవే

చూడుఁడు + ఎ = చూడరె

చూడుఁడు + ఏ = చూడరే.

---

## అధ్యాయము ౪

## విశేష్య, సర్వనామ, విశేషణౌప విభక్తికాదుల లింగవచన విభక్తి రూపభేదములు

భాషాభాగములు:—

తెలుఁగుభాషలోని పదములు, నామవాచకములు, సర్వనామములు, విశేషణములు, క్రియలు, నవ్యయములునని యైదు విధములు.

### విశేష్యములు (నామవాచకములు)

౧. ఇంద్రియ గోచరములగు సమస్త వస్తువులయు, జీవులయు నామములు విశేష్యము లనఁబడును. (విశేష్యములకు నామవాచకము లని నామాంతరము)

ఉదా:—ఇల్లు, చెట్టు, బల్ల, రాముఁడు, గోడ, కొండ, గంగ, పక్షి మొ॥

౨. ఇవి సంజ్ఞానామవాచకములు, జాతి నామవాచకములు, గుణనామవాచకములు, క్రియానామవాచకములు నని నాలుగువిధములు.

3. మనుజులు, దేశములు, కొండలు, నదులు మొదలగు వానికిఁగల పేళ్ళే సంజ్ఞా నామవాచకములు (Proper Nouns).

ఉదా:—రాముఁడు, సీత, వింధ్య, గోదావరి, కృష్ణ, గుంటూరు, ఏలూరు మొ॥

౪. ఒక్కొక్క తెగకు సామాన్యముగాఁ జెల్లు నామములు జాతినామవాచకములు (Real Nouns)

ఉదా:—మనుష్యుఁడు, వృక్షము, నది, పక్షి, రాయి మొదలగునవి.

౫. గుణములను దెలియఁజేయు శబ్దములు గుణనామవాచకములు (Abstract Nouns).

ఉదా:—తీపు, యోగ్యత, చెడ్డతనము, నలుపు, ఎత్తు, తేలిక, దళసరి మొ॥

౬. క్రియలవలనఁ బుట్టినవి క్రియానామవాచకములు (Verbal Nouns)

ఉదా:—వండుట, వంట, పంట, కోఁత, పాట మొ॥

## సర్వనామములు

౭. నామవాచకములకు మాఱుగా నుపయోగింపఁబడు పదములు సర్వనామములు (Pronouns).

౮. నామవాచకములకు వలెనే సర్వనామములకు సైతము లింగ వచన విభక్తులు కలవు. సంబోధన విభక్తి మాత్రము విశేషణముతోఁ గూడియున్న నే కలుగును.

ఉదా:—ఓ చిన్నవాఁడా ! ఓసి చిన్నదానా !

౯. ఇవి పురుషబోధక సర్వనామములు (Personal Pronouns) సంబంధసర్వనామములు(Relative Pronouns) విశేషణ సర్వనామములు (Adjectival Pronouns), ప్రశ్నవాచక సర్వనామములు (Interrogative Pronouns) అని నాలుగువిధములు.

౧౦. పురుషబోధక సర్వనామము లుత్తమాది పురుషలను దెల్పును. ఉదా:—నీవు, నేను, అది, అవి. మొ॥

౧౧. వాక్యమునందలి యితరపదములతోడ సంబంధముగల పదములు సంబంధ సర్వనామములు.

ఉదా:—"ఎవఁడు చేసికొన్న పుణ్యాపాపములు వాఁడే యనుభవించును." ఇచ్చట "ఎవఁడు" అను పదము "వాఁడు" అను పదముతో సంబంధము కలది కావున సంబంధ సర్వనామము.

౧౨. సర్వనామ ధర్మములను, విశేషణధర్మములను గలిగియుండునవి విశేషణ సర్వనామములు.

ఉదా:—అందఱు దుర్జనుని నిందింతురు. (విశేషణము) దుర్జను నందఱు నరులు దూషింతురు.

౧౩. నిర్దిష్టానిర్దిష్ట సంఖ్యావాచకభేదముచే విశేషణ సర్వనామము మూఁడువిధములు.

(౧) సంబంధముగల విషయములను నిర్దేశించునది నిర్దిష్ట సర్వనామము (Demonstrative Pronoun).

ఉదా:—ఆ గ్రామము, ఈతోట.

(ఆ-ఈ, అను రెండును నిర్దిష్టసర్వనామములు)

(౨) తన విశేష్యమునుగూర్చి సంపూర్ణముగ నిర్దేశింపలేనిది యనిర్దిష్ట సర్వనామము (Indefinite Adjective Pronoun). ఉదా:—పెక్కుతెగలు, పలుమాటలు.

(అన్ని, ఇన్ని, ఎన్ని కొన్ని, పలు, అందఱు, ఇందఱు, కొందఱు, పెక్కు, పెక్కండ్రు, పెక్కురు, పలువురు, పలువుండ్రు-ఇవి అనిర్దిష్ట సర్వనామములు,)

(3) సంఖ్యనుదెలుపునవి సంఖ్యావాచక సర్వనామములు (Numeral Adjective Pronouns.)

ఉదా:— ఒకఁడు నిజముఁ జెప్పెను కాని, యిద్దరు కల్లలాడిరి. (ఒక్కఁడు, ఒక్కరితె, ఒక్కటి, ఇద్దరు, ఇరువురు, రెండు, మూఁగురు, ముగ్గురు, మూఁడు మొదలైనవి.)

(పూర్వులు వీనిని సర్వనామములుగాఁ జెప్పిరి కాని వీనియందుఁ గేవల విశేషణ ధర్మమే కానఁబడుటఁ జేసి విశేషణము లని చెప్పుటయే మేలని తోఁచుచున్నది.)

౧౪. ప్రశ్నముల నడుగుటయం దుపయోగింపఁ బడునవి ప్రశ్నవాచక సర్వనామములు.

ఉదా:— ఏసంవత్సరమునఁ బుట్టితివి ? ఎవ్వఁడు కంసుని గూల్చెను ?

(ఏ, ఏవి, ఏమి, ఎందఱు, ఎన్ని, ఎవఁడు, ఎవరు, ఏమె, ఎవతె, ఏది, ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు మొ॥)

## పురుషములు

౧౫. ఉత్తమపురుషము, మధ్యమపురుషము, ప్రథమపురుషము లని పురుషములు మూఁడు విధములు.

(౧) తన్నుఁగూర్చి తాను జెప్పుకొనునది యుత్తమ పురుషము. ఉదా:— నేను, మేము.

(౨) ఎదుటి వానిని గుఱించి తెల్పునది మధ్యమ పురుషము. ఉదా:— నీవు, ఈవు, మీరు, ఈరు.

(3) ఇతరులఁగూర్చి తెల్పునది ప్రథమపురుషము.

ఉదా:—రాముఁడు, రాములు. వీఁడు, వీరు, అది, ఆమె, అతఁడు మొ॥

౧౬. తాను అనునది ప్రథమపురుషముల పునరుక్తిని దొలగించుటకు వచ్చును.

ఉదా:—వాడు (తాను) నిన్న వచ్చితి ననెను. అది (తాను) యోగ్యురాల నని తలంచును.

౧౭. ప్రథమపురుష సర్వనామములకుఁ గొన్నింటికి వాచకవిభక్తి వచనములు గలవు.

ఉదా:—వాఁడు, వారు, ఆమె, వారు,అది,అవి, వీఁడు, వీరు మొ॥

౧౮. పూజయందుఁ ప్రథమపురుషైకవచన పుం వాచకమునకు అతఁడు, ఆయన, ఇతఁడు, ఈయన యని యును, స్త్రీవాచకమునకు ఆమె, ఆపె, ఆకె, ఈమె, ఈపె, ఈకె యనియు రూపములు వచ్చును.

౧౯. "మనము" అనునది మధ్యమోత్తమ పురుష ముల కేకముగా నుపయోగించు నిత్య బహువచనాంత సర్వనామము.

(మనము అనఁగా నీవును, నేనును అని యర్థము.)

౨౦. మధ్యమోత్తమపురుష సర్వనామముల విశేషణములకుఁ గ్రమముగా నేకవచనమున వు ను లును, బహువచనమున రు ము లును, అంతాగమంబులగును. అగుచో ముందటి యుత్వంబున కత్వంబగు.

| | ఏక | బహు |
|---|---|---|
| ఉదా:—మధ్యమ- | నీవు ధన్యుఁడవు | మీరు ధన్యులరు. |
| ఉత్తమ - | నేను ధన్యుఁడను | మేము ధన్యులము. |

౨౧. ఏమిశబ్దమెప్పుడు నేకవచనముగానే యుండును. దీనిమీఁద షష్ఠీవిభక్తిలోని "కి" ప్రత్యయము తప్ప నితర విభక్తులు రావు. ఉదా:—ఏమిటికి; ఎటికి.

౨౨. ఉత్తమ - మధ్యమపురుష సర్వనామములకు మూఁడు వాచకములందును సమానరూపములే యుండును.

ఉదా:— నేను - మేము, నీవు - మీరు.

౨౩. అందఱు, ఇందఱు, కొందఱు, పెక్కండ్రు, మొదలగునవి మహత్ మహతీవాచకములగు. ఇవి నిత్య బహువచనాంతములు.

౨౪. అన్ని, ఇన్ని, ఎన్ని, పెక్కు, పలు: ఇవి అమహద్వాచకములు - నిత్యైకవచనాంతములు.

౨౫. 'ఒక' శబ్దము నిత్యైకవచనము. దీనికి మూఁడు వాచకములందును బెక్కురూపములు గలవు.

మహద్వాచకములు:- ఒకఁడు, ఒకొఁడు, ఒకొక్కఁడు, ఒక్కఁడు, ఒకరుఁడు, ఒకొరుఁడు, ఒక్కరుఁడు, ఒకొక్కరుఁడు మొ॥

మహతీవాచకములు:— ఒకర్త, ఒకరిత, ఒకర్తు, ఒకర్తుక, ఒకత, ఒకతుక, ఒకోరిత, ఒకోర్తు, ఒకోర్తుక, ఒకోతుక, ఒక్కోరిత, ఒక్కర్త, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కత, ఒక్కతుక, ఒకరితి, ఒకర్తి, ఒకతి, ఒకోరితి, ఒకోర్తి, ఒకోతి, ఒక్కరితి, ఒక్కర్తి, ఒక్కతి, ఒక్కోరితి, ఒక్కోర్తి, ఒక్కోతి, ఒకరితె, ఒకర్తె, ఒకతె, ఒకోరితె, ఒక్కోర్తె, ఒకోతె, ఒక్కరితె, ఒక్కర్తె, ఒక్కతె, ఒక్కోరితె, ఒక్కోర్తె, ఒక్కోతె, ఓర్త, ఓర్తి, ఓర్తు, ఓర్తుక.

అమహద్వాచకములు:—ఒకటి, ఒకోటి, ఒక్కోటి, ఒక్కటి, ఒకఁడు, ఒక్కఁడు, ఒకోఁడు, ఒక్కోఁడు, ఒండు.

౨౬. ఏ శబ్దమునకు మూఁడువాచకములందును పెక్కు రూపములు కలవు.

(౧) మహద్వాచకములు:— ఎవఁడు, ఏవాఁడు, ఎవ్వఁడు, ఎవ్వాఁడు, ఏఁడు, (బ-వ) ఎవరు, ఏవారు, ఎవ్వరు, ఎవ్వారు, ఏరు, ఎవండ్రు, ఏవాండ్రు, ఎవ్వండ్రు.

౨. మహతీవాచకములు:—ఏమె, ఏపె, ఏకె, ఎవతె, ఎవ్వరితె, ఎవ్వతె, ఎవర్తె, ఎవరితె, ఎవర్తుక, ఎవ్వర్తుక, ఎవ్వతుక, ఎవ్వత, ఎవ్వర్త, ఎవరిత, ఎవ్వరిత, ఎవరితి, ఎవ్వరితి, ఎవర్తి, ఎవర్తె, ఎవర్తుక, ఎవ్వర్తుక, ఎవతుక.

(3) అమహద్వాచకములు:— ఎది, ఎద్ది, ఏది, ఏయది, ఎయ్యది, ఎవి, ఎవ్వి, ఏవి, ఏయవి.

ప్రథమపురుష సర్వనామమునకు మూఁడువాచకము లందును, విభక్తి వచనరూపములు :—

వాఁడు (ప్రథమపురుష)

| వాచకము | విభక్తి | ఏక. | బహు. |
|---|---|---|---|
| మహత్తు | ప్రథమ | వాఁడు | వారు, వారలు, వాండ్రు. |
| మహతి | ,, | ఆమె, అది | వారు, వారలు, వాండ్రు. |
| అమహత్తు | ,, | అది, అద్ది, ఆయది, అయ్యది, | అవి, అవ్వి, ఆయవి, అయ్యవి. |
| మహత్తు | ద్వితీయ | వానిన్ | వారిన్, వారలన్, వారిని, వాండ్రన్. |
| మహతి | ,, | దానిని, దానిన్ ఆమెను, ఆమెన్ | ,, |
| అమహత్తు | ,, | దానిన్ | వానిన్ |
| మహత్తు | తృతీయ | వానిచేతన్ | వారిచేతన్, వాండ్రచేతన్, వారలచేతన్. |
| మహతి | ,, | దానిచేతన్ ఆమెచేతన్ | ,, |
| అమహత్తు | ,, | దానిచేతన్ | వానిచేతన్ |

ఇట్లే తక్కినవి చూచుకొనవలెను.

## విశేషణములు (ADJECTIVES)

౭౭. నామవాచకముల విశేష గుణములను దెలుపునవి విశేషణము లనంబడును.

ఉదా:—నల్ల, తెల్ల, మంచి మొ॥

౭౮. ఇవి గుణవిశేషణము, క్రియా విశేషణము, సంఖ్యావిశేషణము, క్రియాజన్య విశేషణము, విధేయవిశేషణము నని యైదు విధములు.

(అ) గుణవిశేషణములు (Adjectives of Quality):- ఇవి విశేష్యముయొక్క గుణములను దెలుపుచు దానికి ముందుగా వ్యస్తముగాఁగాని, సమసించిగాని ప్రయోగింపఁబడుచుండును.

ఉదా:—మంచిగుఱ్ఱము, పెద్ద మనుష్యుఁడు, గుణవంతుఁడు రాముఁడు, నిగ్గు టద్దము మొ॥

(ఆ) క్రియావిశేషణములు (Adverbs):— ఇవి క్రియలలోని విశేషములను దెలుపుచుండును.

ఉదా:—మెల్లఁగాఁజదివెను, గట్టిగాఁగొట్టెను మొ॥

(ఇ) సంఖ్యావిశేషణములు (Numeral adjectives):- ఇవి విశేష్యముల సంఖ్యను దెలుపునవి.

ఉదా:—ఇద్దఱు, ముగ్గురు, మూఁడు మొ॥

ఇవి సంఖ్యార్థకము, సంఖ్యేయార్థకము, పూరణార్థకము నని మూఁడు విధములు.

(౧) సఙ్ఖ్యార్థకము. ఉదా:—రెండు, మూఁడు మొ॥

(౨) సంఖ్యేయార్థకము ఉదా:—ఇద్దఱు, ముగ్గుఱు మొ॥

(3) పూరణార్థకము. ఉదా:—రెండవ, మూఁడవ మొ॥

(ఈ) క్రియాజన్య విశేషణములు (Participle adjectives):—ఇవి క్రియలన్నిఁటినుండియు నేడేఁసి విధములుగాఁ బుట్టుచుండును.

ఉదా:—చేదువుచున్న, చదివిన, చేదువఁగల, చేదివెడు, చదివెడి, చేదువు, చేదువని. (ఇట్లన్ని క్రియలకుఁ జూచుకొనునది)

(ఉ) విధేయవిశేషణములు:—ఇవి విశేష్యములతో సమసింపక విశేష్యగుణములను దెలుపుచు విశేష్యములకుఁ దరువాతనుండి క్రియ నపేక్షింపక వాక్యపూర్తిచేయుచుండును.

ఉదా:—విష్ణుశర్మ విద్యావంతుఁడు; రంగఁడు పెద్దవాఁడు; నీవు కనిష్ఠుఁడవు.

౨౯. ప్రాయికముగాఁ దెనుఁగు విశేషణములు స్త్రీలింగసమములై యుండునుగాన లింగ వచనాది భేదములేక యెల్ల విశేష్యములయందుఁ బ్రయోగింపఁబడును.

ఉదా:—పెద్ద మనుష్యుఁడు, మంచి పడంతి, చిన్న అడవి, పెద్ద మనుష్యులు మొ॥

3౦. విశేష్యములు పరమగునపుడు అకారాంత గుణవాచకముల తుదను నివర్ణము బహుళముగా వచ్చును.

ఉదా:—నల్లకోక, నల్లనికోక, చక్కనిబాలుఁడు, చిన్న పుస్తకము. మొ॥

౩౧. క్రియాజన్యవిశేషణములు, క్రియావిశేషణములు కాక తక్కిన విశేషణములలోఁ గొన్నిటికి "ల, ఐన, అగు, ఛా" అనునవి బహుళముగా ననుప్రయుక్తములగును.

ఉదా:— ముద్దుల కృష్ణుఁడు, ముద్దైన కృష్ణుఁడు, ముద్దగు కృష్ణుఁడు, ముద్దాకృష్ణుడు, ముద్దుకృష్ణుఁడు.

౩౨. లింగబోధక ప్రత్యయములతోఁ గూడిన విశేషణముల కీ యాగమముల నేదేని నిత్యము.

ఉదా:—యోగ్యుఁడగు, మృదువగు, అందమగు మొ॥

౩౩. ఒకానొకచోఁ గొన్ని విశేష్యములు విశేషణములుగా నగును.

ఉదా:—(అ) పసిడికంచము, వెండిచెంబు
(ఆ) పోతనకవి, తెలుఁగుభాష
(ఇ) దున్నపిల్ల, కోడిపుంజు, గొఱ్ఱెపోతు
(ఈ) వంటయిల్లు, పంటచేను
(ఉ) వేడిపాలు, ఎత్తుగోడ మొ॥

౩౪. స్వభావాధిక్యమును దెలుపునపుడు సంస్కృత విశేషణములకు నిజ, తర, తమస్థితులగు.

ఉదా:—ఘనశైలము, ఘనతరశైలము, ఘనతమశైలము.

౩౫. కొన్ని విశేషణములు విశేష్యములవల్లఁ బుట్టుచున్నవి. ఉదా:—

| విశేష్యము | విశేషణము |
| --- | --- |
| ఓడు | ఓటి |
| చెవుడు | చెవిటి |
| కుంటు | కుంటి |
| జున్ను | జుంటి |

## ఔపవిభక్తికములు (CASE SUFFIXES)

౩౬. ద్వితీయాద్యేకవచనములు పరములగు నపుడు కొన్ని జడనామవాచకములకుఁ, గొన్ని సర్వనామములకుఁజివర ఆగమాదేశరూపంబుగ వచ్చు, ఇ, టి, తి, వర్ణకంబు లౌపవిభక్తికంబు లనంబడును.

౩౭. ఊరు లోనగువానికి ఇత్వము వచ్చును.

ఉదా:— ఊరిని - ఊరియందు - ఊరికొఱకు (కోడలు - చెల్లెలు - ప్రేలు - ప్రోలు - నూలు - కాలు. మొదలగువాని కీరూపము వచ్చును.)

౩౮. టి వర్ణంబు కొన్నింటి కంతాగమంబగు.

ఉదా:—అన్ని - అన్నింటిని మొదలగునవి.

౩౯. అది కొన్ని శబ్దంబుల తుది యక్షరమున కాదేశంబగు. ఉదా:—ఏరు- ఏటిని; తాఁబేలు-తాఁబేటిని మొ॥

౪౦. అది పర్యాయంబునఁ గొన్ని శబ్దములకు రెండు విధములుగ నగును. ఉదా:—పగలు-పగలిటిని-పగటిని మొ॥

౪౧. హ్రస్వముమీఁది టి వర్ణకమునకుముందు పూర్ణబిందువు బహుళముగ నగు.

ఉదా:—పగంటిని, పగటిని, పగలింటిని, పగలిటిని, మొ॥

౪౨. శబ్దము తొలి హ్రస్వముమీఁది టివర్ణకమునకు ముందు పూర్ణబిందువు నిత్యముగ నగు.

ఉదా:—విల్లు - వింటిని - కన్ను - కంటిచేత మొ॥

౪౩. కొన్నిశబ్దములకుఁ బర్యాయంబున రెండునగు.

ఉదా:—నోరిచేత - నోటిచేత - నోటికొఱకు మొ॥

౪౪. అఱ్ఱు లోనగువానికి 'తి' అనునది ఆగమంబగు. (అగుచో రేఫంబున కొక్కటికి లోపంబగు).

ఉదా:—అఱ్ఱు + చేత = అఱుతిచేత.

౪౫. టి. తి. వర్ణకంబులు పరంబగునపు డుత్వంబున కిత్వంబగు. ఉదా:—రెండిటికి - అఱితికి.

౪౬. టి వర్ణకంబు పరంబగునపుడు క్రిందు, మీఁదు, ముందు లోనగు శబ్దంబులయు 'రేపు, మాపు' లోనగు శబ్దంబులయు ఉత్వంబున కత్వంబగు.

ఉదా:—క్రిందు, క్రిందటికి - మాపు, మాపటికి.

౪౭. ఔప విభక్తికముల తృతీయా సప్తమీ విభక్తులకు అత్వం బాదేశంబగు.

ఉదా:—గోరిచేతను - గోరను (తృతీయ)
ఊరియందు - ఊరను (సప్తమి)
గొడ్డటిచేతన్ - గొడ్డటన్ (తృతీయ)
ఇంటియందు - ఇంటన్ (సప్తమి)

## లింగము (GENDER)

నామవాచకములకు లింగ వచన విభక్తులు గలవు.

౮౮. స్త్రీ పుం నపుంసక భేదరూపమగు లింగము తెనుఁగున వాచకమని వ్యవహరింపఁబడినది.

౮౯. సంస్కృతమున లింగము శబ్దమునుబట్టి యేర్పడినది- తెనుఁగున వాచక మర్థము నాశ్రయించి యేర్పడినది.

౯౦. ఆ వాచకము మహద్వాచకము, మహతీవాచకము, అమహద్వాచకము అని మూఁడు విధములు.

౯౧. మహద్వాచకము (Masculine) పురుషులను దద్విశేషణములను దెలుపును.

ఉదా:—రాముఁడు, హరి, అయ్య.

౯౨. మహతీవాచకము (Feminine) స్త్రీలను, దద్విశేషణములను దెలుపును. ఉదా:—సీత, అమ్మ, అక్క.

౯౩. అమహద్వాచకము (Neuter) మృగములు' పక్షులు, కొండలు, మొదలైన తిర్యగ్జడవాచకములను, దద్విశేషణములను దెల్పును.

ఉదా:—సింహము, హంస, తేలు, హిమాద్రి, గంగ, వేఁపచెట్టు మొ॥

౯౪. పదభేదమునొంది కొన్ని మహద్వాచకములు మహతీవాచకము లగును.

| మహత్తు | మహతి |
|---|---|
| పురుషుఁడు | స్త్రీ |
| పిత | మాత |
| వరుఁడు | వధువు |
| పెనిమిటి | పెండ్లము |
| మామ | అత్త |
| బావ | వదినె |

౫౫. పదాంతమందు మార్పుఁజెంది కొన్ని మహద్వాచకములు మహతీవాచకములగును.

| మహత్తు | మహతి |
|---|---|
| నాయకుఁడు | నాయిక |
| జనకుఁడు | జనని |
| పాఠుఁడు | పాఠిత |
| వగలాఁడు | వగలాడి |
| చెలికాఁడు | చెలికత్తె |

౫౬. కొన్ని మహత్ మహతీ వాచకములకు ఏకరూపము కానబడుచున్నది.

ఉదా:—ఒయ్యారి, అసుర, జాణ, బిడ్డ. మొ॥

## విభక్తి (CASE)

౫౭. నామవాచకములకుఁ గాని, సర్వనామములకుఁ గాని వాక్యమందలి యితరపదములతోఁ గల సంబంధమును దెలుపునది విభక్తి యనఁబడును.

౫౮. విభక్తి ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి, సంబోధనప్రథమ యని యెనిమిది విధములు.

౫౯. విభక్తులందు నామవాచకములు మొదలగు వానికిఁ బ్రత్యయములు విధింపఁబడును. ప్రత్యయములకు వర్ణకములని నామాంతరము కలదు.

విభక్తి ప్రత్యయములు

| ప్రత్యయములు | విభక్తులు |
|---|---|
| డు, ము, వు, లు, | ప్రథమావిభక్తి |
| నిన్, నున్, లన్, కూర్చి | ద్వితీయావిభక్తి |
| చేతన్, చేన్, తోడన్, తోన్ | తృతీయావిభక్తి |
| కొఱకున్, కై | చతుర్థీవిభక్తి |
| వలనన్, కంటెన్, పట్టి | పంచమీవిభక్తి |
| కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్, | షష్ఠీవిభక్తి |
| అందున్, నన్, | సప్తమీవిభక్తి |
| ఓ, ఓయి, ఓరి, ఓసి, | సంబోధనప్రథమావిభక్తి |

(పిలుచుట కుపయోగించునది సంబోధన ప్రథమావిభక్తి)

౬౦. విభక్తి ప్రత్యయములలో డు, ము, వు, న, లేకవచనంబులు: లు వర్ణకము బహువచనము; తక్కినవి యుభయంబులు.

౬౧. ఇకారాంతములు కాని మహద్వాచకముల ప్రథమైకవచనమునకు "ఁడు" వర్ణకమగును.

ఉదా:— (రామ) రాముఁడు, (విధాతృ) విధాతృఁడు (శంభు) శంభుఁడు.

౬౨. కొన్ని యమహద్వాచకములు "డు" వర్ణకమును జెంది పుంలింగము లగును.

ఉదా:—సముద్రుఁడు, మేఘుఁడు, హిమవంతుఁడు.

౬౩. "డు" వర్ణకముతోఁగూడి మహత్తులు కాని కొన్ని దేశ్యపదములు మహత్సమము లగుచున్నవి.

ఉదా:—కర్తళఁడు, పరికాఁడు.

౬౪. అకారాంతములగు అమహద్వాచకములకును, నపుంసకశబ్దములకును ప్రథమైకవచనమున ము వర్ణకమగును.

ఉదా:—వనము, అశ్వము, ఫలము మొ॥

౬౫. వీనికి ము వర్ణకేతరమైన విభక్తి పరమగునపుడు ము వర్ణమాగమముగా నగును. (ము వర్ణకేతర విభక్తియనఁ ప్రథమా బహువచనము మొదలు సప్తమీ బహువచనము వఱకు అని యర్థము.)

ఉదా:—వనములు, వనమును, వనములను, వనము చేత, వనముల చేత, మొ॥

౬౬. ము వర్ణకమంతమందు వచ్చు కొన్ని మహద్వాచకము లమహద్వాచక సమములగును.

ఉదా:—జనము, చుట్టము.

౬౭. మూఁడువాచకములందును ఉకారాంత తత్సమ శబ్దములకుఁ ప్రథమైక వచనమున వు వర్ణకము వచ్చును.

ఉదా:—శంభువు, వధువు, వస్తువు.

౬౮. వు వర్ణకేతర ప్రత్యయము పరమగునపుడు వానికి వు వర్ణమంతాగమమగును.

ఉదా:—శంభువులు, శంభువులను, ధేనువు, ధేనువులను, వధువుచేత మొ॥

౬౯. ఉకారాంతములుకాని స్త్రీ వాచకములకుఁ బ్రథమైక వచనమున నే ప్రత్యయము రాదు.

ఉదా:—వనిత, సీత, అక్క, అమ్మ, తల్లి. మొ॥ (ఉకారాంతములుకాని యనుటచే వధువు, జరత్కారువు, మొదలగునవి యుండును.)

౭౦. ఓ ఆమంత్రణంబునం దగును. (ఆమంత్రణమనఁ బిలుచుట) ఉదా:—ఓ రాముఁడ ! ఓ సీతా ! మొ॥

౭౧. ఓయి అనునది పురుషామంత్రణంబునందు, ఓరి-నీచపురుషామంత్రణంబునందు, ఓసి-నీచస్త్రీ యామంత్రణంబునందు నగును.

ఉదా:—ఓయి రాముఁడా ! ఓరి దుష్టుఁడా ! ఓసి దుష్టురాలా !

౭౨. ఓరి, ఓసి, మైత్రియందును నగు.

ఉదా:—ఓరి ముద్దుకృష్ణా ! ఓసి ముద్దుబాలా !

౭౩. సంబోధనంబున నేకవచనంబున నామంబు కడపటి ఉకారమునకు అకారమగును.

ఉదా:—ఓరాముఁడ ! ఓకృష్ణుఁడ మొ॥

౭౪. సంబోధనంబున నామంబు తుది అకార ఇకారములకు దీర్ఘము వికల్పముగ నగును.

ఉదా:—రామ, రామా. హరి, హరీ. తండ్రి, తండ్రీ.

౭౫. సంబోధనంబున ఓ మొదలగు ప్రత్యయములు వికల్పముగ లోపించును. ఉదా:—ఓ నెలంత, నెలంత. ఓయి చెలికాండ, చెలికాండ. ఓసి చెలీ, చెలి. మొ॥

౭౬. సంబోధమునందు స్త్రీ వాచకముల యేకవచనము తుదను రా, రో అను వర్ణకములు వచ్చును.

ఉదా:—అమ్మరా, అమ్మరో; అక్కరా, అక్కరో.

౭౭. ఇవి మహద్వాచకములగు కొన్ని స్త్రీసమశబ్దములమీదను గానంబడియెడి.

ఉదా:—అన్నరా, అన్నరో; బావరా, బావరో.

౭౮. సంబోధమునందు బహువచనమునకు "ఆర" అనునది యంతాగమంబగు. దీనికి పక్షంబున దీర్ఘంబునగు.

ఉదా:—ఓ రాములార! ఓరాములారా! ఓ కృష్ణులార! ఓకృష్ణులారా!

౭౯. కృతోత్కంబగు సంస్కృతనామంబు "డు" వర్ణకంబునకు లోపంబు విభాషనగు.

ఉదా:—ఓరామా, ఓరామ! ఓకృష్ణా! ఓకృష్ణ.

౮౦. ఉదంతమగు తత్సమ శబ్దంబు డు వర్ణకంబున 'కూకా' రము ప్లుతమాదేశంబు విభాషనగు.

ఉదా:—ఓశంభూ! ఓ విష్ణూ! (పక్షంబున) ఓశంభుండ.

కొన్ని శబ్దములకు విభక్తి వచనరూపములు:—

అకారాంతపుంలింగము, 'మగఁడు' శబ్దము.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమా | మగఁడు. | మగలు. |
| సంబోధన | ఓమగఁడ, ఓమగఁడా ఓయి మగఁడ, ఓయి మగఁడా ఓరి మగఁడ, ఓరిమగఁడా, ఓరీమగఁడ, ఓరీమగఁడా! | ఓమగలార, ఓ మగలారా. |
| ద్వితీయా | మగనిన్, మగనిని, మగనిఁగూర్చి, మగని గుఱించి. | మగలన్, మగలను, మగలఁగూర్చి, మగలను గుఱించి, మగలగుఱించి. |
| తృతీయా | మగనిచేతన్, మగని చేన్, మగని తోడన్, మగనితోన్. | మగల చేతన్, మగల చేన్, మగల తోడన్, మగలతోన్. |
| చతుర్థీ | మగని కొఱకున్, మగనికై. | మగలకొఱకున్, మగలకై. |
| పంచమీ | మగనివలనన్, మగని కంటెన్, మగనిఁబట్టి. | మగలవలనన్, మగల కంటెన్, మగలఁబట్టి. |
| షష్ఠీ | మగనికిన్, మగని యొక్క. | మగలకున్, మగల యొక్క, మగలలోన్, మగల లోపలన్. |
| సప్తమీ | మగనియందున్ | మగలయందున్ |

## వృద్ధశబ్దము

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | వృద్ధు, వృద్ధుఁడు | వృద్ధులు |
| సం. ప్ర. | ఓవృద్ధు, ఓవృద్ధూ,<br>ఓవృద్ధుఁడ,<br>ఓవృద్ధుఁడా, ఓయివృద్ధు,<br>ఓయి వృద్ధూ,<br>ఓయి వృద్ధుఁడ, ఓయి<br>వృద్ధుఁడా,<br>ఓయీవృద్ధుఁడ, ఓయీ<br>వృద్ధుఁడా,<br>ఓరివృద్ధు, ఓరివృద్ధూ,<br>ఓరి వృద్ధుఁడ,<br>ఓరివృద్ధుఁడా, ఓరీవృద్ధు,<br>ఓరీవృద్ధూ,<br>ఓరీవృద్ధుఁడ, ఓరీ<br>వృద్ధుఁడా, వృద్ధు, వృద్ధూ,<br>వృద్ధుఁడ, వృద్ధుఁడా, | ఓవృద్ధులార,<br>ఓవృద్ధులారా,<br>వృద్ధులార,<br>వృద్ధులారా, |
| ద్వి. వి. | వృద్ధునిన్, వృద్ధున్,<br>వృద్ధునిఁగూర్చి, వృద్ధుఁ<br>గూర్చి, వృద్ధునిగుఱించి,<br>వృద్ధుగుఱించి. | వృద్ధులన్, వృద్ధులను<br>గూర్చి, వృద్ధులఁగూర్చి<br>వృద్ధులగుఱించి, వృద్ధు<br>లనుగుఱించి. |



| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| తృ. వి. | వృద్ధుచేతన్, వృద్ధుని చేతన్, వృద్ధుచేన్ వృద్ధునిచేన్, వృద్ధుతోడన్, వృద్ధునితోడన్, వృద్ధునితోన్, వృద్ధుతోన్. | వృద్ధులచేతన్, వృద్ధులచేన్, వృద్ధులతోడన్, వృద్ధులతోన్. |

సీతశబ్దము

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. వి. | సీత | సీతలు |
| సం. ప్ర. వి. | ఓసీత, ఓసీతా, ఓసి సీత, ఓసి సీతా, ఓసి సీత, ఓసీ సీతా, సీతరొ, సీతరో, సీత, సీతా. | ఓసీతలార, ఓసీతలారా, సీతలార, సీతలారా. |
| ద్వి. వి. | సీతను, సీతఁగూర్చి, సీతను గూర్చి, సీత గుఱించి, సీతనుగుఱించి | సీతల, సీతలన్, సీతలఁ గూర్చి, సీతలనుగూర్చి సీతలగుఱించి, సీతలను గుఱించి. |

(శేషమూహించుకొనునది.)

విభక్తుల యుపయోగములు:—

౮౧. ప్రథమావిభక్తి సకర్మక అకర్మక కర్తల యందును, కర్మణి కర్మలయందును నగ్గును.

ఉదా:—సకర్మక కర్తకు-రాముఁడు భూమిని పాలించెను.

అకర్మక కర్తకు-చంద్రుఁడు ఉదయించెను.

కర్మణి కర్మకు రామునిచే భూమి పాలింపఁబడియె.

౮౨. కర్త ప్రథమయందున్నప్పుడు కర్మకు ద్వితీయ (ని. ను. ల ప్రత్యయములు) అగును.

ఉ:—రాముఁడు భూమిని పాలించెను.

౮౩. కర్మణికర్తకును హేతుకరణంబులకును, గ్రహ్యాది యోగంబునఁగలుగు పంచమికిని, తృతీయ (చేత, చే ప్రత్యయములు) యగును. (కరణమనఁ గ్రియాసిద్ధి కుపకరించు సాధనము) ఉదా:—

కర్మణికర్తకు-దేవదత్తుచేత శాస్త్రము చదువఁబడియె.

హేతువునకు—నీవువచ్చుటచేఁ గార్యము నెఱవేరెను.

కరణమునకు—కత్తిచేత నఱికెను.

గ్రహ్యాదియోగమున—ఈయర్థము నీచే నెఱింగితి.

౮౪. తృతీయావిభక్తి (తోడ, తో ప్రత్యయములు) కరణ, సహాయార్థ, తుల్యార్థ వచ్యర్థములకు బహుళముగనగు.

ఉదా:—కరణము-కోలతోడఁ గూలనేసె.

సహాయార్థము-రాజు సేనలతోడ వచ్చె.

తుల్యార్థము-చైత్రునితోడ మైత్రుఁడు తుల్యుఁడు.

వచ్యర్థము-చైత్రుఁడు మైత్రునితో నిట్లనియె.

౮౫. చతుర్థీవిభక్తి (కొఱకు, కై ప్రత్యయములు) సంప్రదానంబునకును, ఉద్దేశ్యమాత్రంబునకునగు. (త్యాగోద్దేశ్యంబు సంప్రదానమ్మనఁబడు.)

ఉదా:—

సంప్రదానమునకు-జనకుఁడు రామునికొఱకుఁ గన్యనిచ్చెను.
ఉద్దేశ్యమునకు-పురుషార్థము కొఱకు యత్నింపవలయును.

౮౬. సంప్రదానమునఁ జతుర్థికిమాఱు షష్ఠితఱచుగ నగు. ఉదా:—జనకుఁడు రామునకుఁ గన్యనిచ్చెను.

౮౭. అపాయము, భయము, జుగుప్స, పరాజయము, ప్రమాదము, గ్రహణము, భవనము, త్రాణము, విరామము, అంతర్ధి, వారణము, నెద్దానవగు దానికిఁ బంచమి (వలన వర్ణకంబు) వచ్చును. ఉదా:—

అపాయమునకు-లతవలనఁ బుష్పంబు దొరఁగె.
భయమునకు - చోరునివలన భయపడియె.
జుగుప్సకు - పాపంబువలన నేవగించె.
పరాజయమునకు - అధ్యయమువలన డస్సె.
ప్రమాదమునకు - పాడివలనఁ బరాకుపడియె.
గ్రహణమునకు - ప్రజలవలనఁ గప్పంబుఁగొనియె.
భవనమునకు - మనువువలనఁ బ్రజలు పుట్టిరి.
త్రాణమునకు - చోరునివలన రక్షించె.
విరామమునకు - భోగంబువలన విరమించె.
అంతర్ధికి - కృష్ణుఁడు తల్లివలన డాఁగె.
వారణమునకు - తల్లి బిడ్డను భయమువలన వారించె.

(అపాయము = విశ్లేషము, భయము = వెఱపు, జుగుప్స = ఏవ, పరాజయము = డయ్యుట, ప్రమాదము = పరాకు, గ్రహణము = కైకొనుట, ఎఱుంగుట, వినుట మొ॥

భవనము = పుట్టుట, త్రాణము = కాచుట, విరామము = విరమించుట, అంతర్ధి = మఱుఁగుట, వారణము = నివారించుట.)

౮౮. ఈ పంచమికిఁ గొన్నితావుల షష్ఠియునగు.

ఉదా:—చోరునకు భయపడియె. పాపంబున కేవగించె. రాముండు దశరథునకుఁబుట్టె.

౮౯. అన్య దూర పూర్వ సమీపాదుల యోగంబునను, నిర్ధారణంబునను పంచమి (కంటె వర్ణకము) వచ్చును.

ఉదా:—అన్యమునకు - రామునికంటె నన్యుఁడు వీరుఁడు లేఁడు.

దూరమునకు - కృష్ణకంటె గోదావరి దూరము.

పూర్వమునకు - రాముఁడు కృష్ణునికంటెఁ బూర్వుఁడు.

సమీపమునకు - దానికంటె నిది సమీపము.

నిర్ధారణమునకు - శరీరబలముకంటె బుద్ధిబల మెక్కుడు.

౯౦. వలన వర్ణకంబున కొకచో 'ఉండి' యను ప్రయుక్తంబగు. ఉదా:-ఆకాశమువలననుండి గంగవాడమె.

౯౧. ఉండి పదం బనుప్రయుక్తమగుచో వలనకు ద్వితీయయు, సప్తమియు తఱచుగనగు.

ఉదా:—ఆకాశమునుండి గంగవాడమె - వనమునందుండి వచ్చె.

౯౨. హేతువులగు గుణక్రియలకు పట్టి వర్ణకంబునగు.

ఉదా:—జ్ఞానముంబట్టి మోక్షముకలుగును. నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడనైతి.

౯౩. షష్ఠీవిభక్తి కి, కు, ప్రత్యయములు సంబంధము నందును, గాలావధియందునగు.

ఉదా:—నాకుం దమ్ముఁడు - హరికి నెచ్చెలి - ఏడాదికి వచ్చెను - నెలకు రమ్ము.

౯౪. సంబంధంబున షష్ఠికి యొక్క వర్ణకంబగు.

ఉదా:—రామునియొక్క గృహము.

౯౫. నిర్ధారణ షష్ఠికి లో, లోపల, వర్ణకంబులగు.

ఉదా:—రాజుల లోపల రాముఁడుత్తముఁడు. మనుష్యులలో క్షత్రియుఁడు శూరుఁడు.

౯౬. అధికరణ,దూ,రాంతికా, ర్థంబుల సప్తమియగు.

(అధికరణము=ఆధారము. అది ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకమునని మూఁడు విధములు.)

ఉదా:—ఔపశ్లేషికము-(ఒకదానితో నొకటియొరసియుండుట) - ఘటమునందు జలమున్నది.

వైషయికము-(విషయసంబంధమైనది) -మోక్షమునందిచ్ఛగలదు.

అభివ్యాపకము (అంతట వ్యాపించినది) - అన్నిటియందీశ్వరుఁడు కలఁడు.

దూరము - లండను దూరమందున్నది.

అంతికము - (సమీపము) - కృష్ణ సమీపమందున్నవి.

౯౭. ఉకారాంతజడములకు నవర్ణకమగును.

ఉదా:—ఘటమున జలమున్నది. మోక్షమున నిచ్ఛగలదు.

## వచనము (NUMBER)

౯౮. నామవాచకముల సంఖ్యను దెల్పునది వచన మనఁబడు. ఉదా:—రాముఁడు, రాములు.

౯౯. ఇది ఏకవచనము బహువచనము అని రెండు విధములు. ఏకవచనము (Singular) ఒకదానిని తెలుపును.
ఉదా:—రాముఁడు, స్త్రీ, వస్తువు.

౧౦౦. బహువచనము (Plural) అనేకములను దెలుపును. ఉదా:—రాములు, స్త్రీలు, వస్తువులు.

౧౦౧. నపుంసకలింగ బోధకమగు ము వర్ణకమునకు మూఁముడి (మవత్తు) గాని పూర్ణబిందుపూర్వక బు వర్ణకము గాని వికల్పముగవచ్చును. ఉదా:—వనము-వనమ్ము-వనంబు.

౧౦౨. సామాన్యముగ ఏకవచనము తుదను లు చేర్చుటవలన బహువచన మేర్పడును.
ఉదా:—రాముఁడు + లు = రాములు - స్త్రీలు.

౧౦౩. బహువచనము పరమగునపుడు పుంలింగబోధక మగు 'ఁడు' వర్ణకము లోపించును. లింగబోధక మనుటచేఁ దాఁడు మొదలైనవానికి లోపము లేదు.

ఉదా:—రాముఁడు-రాములు; గురుఁడు-గురులు

౧౦౪. బహువచనము పరమగునపుడు ఇకారాంత శబ్దముల ఇకారము ఉకారమగును.

ఉదా:—హరి - హరులు; మతి - మతులు.

౧౦౫. రెండక్షరముల శబ్దములును ర, ల, డ, లు ఉపధలుగాఁగల శబ్దములును గాని ఇకారముపాంత్యముగాఁ గలశబ్దముల ఉపాంత్య ఇకారము ఉకారమగును.

(ఉపధ = కొనవర్ణమునకు ముందక్షరము)

ఉదా:—కలికి - కలుకులు.

రెండక్షరములు:—జిగి - జిగులు.

ర ఉపధగాఁ గల :—పందిరి - పందిరులు.

ల ,, :—పిడికిలి - పిడికిళులు.

డ ,, :—రాపిడి - రాపిడులు.

౧౦౬. డు వర్ణకమువచ్చు శబ్దములకు ద్వితీయాద్యేక వచనంబు పరంబగునపుడు ప్రత్యయమునకు ముందు నివర్ణము సర్వత్ర విభాషనాగమంబగు.

ఉదా:—రామునిని - రాముని - రాముని చేత - రాము చేత. రామునికి - రామునకు. (సర్వత్రయనుట వక్ష్యమాణ నవర్ణాగమబాధనార్థము)

౧౦౭. డు వర్ణకము వచ్చు ఉదంతములుకాని తెనుఁగు శబ్దములకు నివర్ణాగమము నిత్యముగానగు.

ఉదా:—మగనిని, మగనిచేత, మగనికిని. ('ఉ' దంతములుకాని వనుటచే అల్లుఁడు, బల్లిదుఁడు మొదలగువానికి నివర్ణాగమము వికల్పము. ఉదా:—అల్లునిచేత - అల్లుచేత, బల్లిదునిచేత - బల్లిదుచేత మొ॥)

౧౦౮. బహువచనంబున ద్వితీయాది విభక్తులు పరం బగునపుడు లు వర్ణకము ఉకారమున కకారమగును.

ఉదా:—రాములను, రాముల చేత, రాములయందు.

౧౦౯. ౹డు వర్ణకమువచ్చు పుంలింగములకును, ఇ ఈ ఐ అంతమందు౹గల పదములకును నివర్ణకమును, తక్కినవానికి నువర్ణకమును ద్వితీయైకవచనమున వచ్చును.

ఉదా :—రామునిన్, హరినిన్, శ్రీనిన్, రైనిన్.

ను వర్ణకము :—దొరను - విధాతను - వనమును.

౧౧౦. మధ్యమపురుష సర్వనామములగు నీ మీ లకు౹ దక్క ఇ ఈ ఐ కారాంతముల షష్ఠి ఏకవచనము లందు కి వర్ణకము వచ్చును. నీ మీ లకు కువర్ణకమువచ్చును.

ఉదా :—హరికిన్-రైకిన్-శ్రీకిన్ - నీకున్ - మీకున్

౧౧౧ ఉకార ఋకారముల మీ౹ద కు వర్ణకమునకు ముందు నవర్ణ మాగమమగును.

ఉదా :—రామునకున్-వనమునకున్-విధాతృనకున్.

౧౧౨. ఉకార ఋకారములకు అందు వర్ణకము పర మగుచో దానిముందు న వర్ణకము వచ్చును.

ఉదా :—వనమునందున్, విధాతృనందున్.

౧౧3. కలను లోనగు శబ్దముల ను వర్ణము ఏకవచన మున వైకల్పికముగను, బహువచనమున నిత్యముగను "౹కు" వర్ణమగును.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ఉదా :—కలను | - కల౹కు | కల౹కులు. |
| కెలను | - కెల౹కు | కెల౹కులు. |
| కొలను | - కొల౹కు | కొల౹కులు. |

| ఏకవచనము | బహువచనము |
| --- | --- |
| ప్రాను - ప్రాఁకు | ప్రాఁకులు |
| వరను - వరఁకు | వరఁకులు |
| కొరను - కొరఁకు | కొరఁకులు |
| నెఱను - నెఱఁకు | నెఱఁకులు |
| వలను - వలఁకు | వలఁకులు |

౧౧౪. అట్లు రేను, గోను శబ్దముల ను వర్ణము "ఁగు" వర్ణమగును.

| ఏక | బహు |
| --- | --- |
| ఉదా:—రేను - రేఁగు | రేఁగులు |
| గోను - గోఁగు | గోఁగులు |

౧౧౫. చేను మొదలగు శబ్దములకు బహువచనము పరమగునపుడు కడవర్ణము లోపించును.

ఉదా:—చేను-చేలు, రేయి-రేలు, మ్రాను-మ్రాలు. (చేను, రేయి, ఱాయి, వేయి, ప్రాయి మొదలగునవి.)

౧౧౬. ఈలోప మావు ప్రభృతులకు వైకల్పికము.

| ఏక | బహు |
| --- | --- |
| ఉదా:—ఆవు | ఆలు, ఆవులు |
| జాము | జాలు, జాములు |
| చుట్టము | చుట్టలు, చుట్టములు |
| మ్రాసము | మ్రాసలు, మ్రాసములు |

౧౧౭. అదంతమై దీర్ఘపూర్వక లకార ముపధగాఁగల మహద్వాచక తత్సమ శబ్దము బహువచన లకారమునకు రేఫంబగు. ఉదా:—బాలుఁడు, బాలుర్రు, బాలుర చేత మొ॥

౧౧౮. ఈకార్యము దయాళుశబ్దమునకును పగతాదులగు కొన్ని తెలుఁగుశబ్దములకుఁ గూడఁ గానంబడియెడి.

ఉదా:—దయాళుఁడు, దయాళురు, దయాళుర చేత.

పగతుఁడు, పగతురు, పగ్తుర చేత.

అల్లుఁడు, అల్లురు, అల్లుర చేత మొదలగునవి.

౧౧౯. బహువచనము పరంబగునపుడు డ,ల,ట,ర,ల యుత్వంబునకు లోపము బహుళముగా నగును.

ఉదా:—డు: గుండు - గుండులు - గుండ్లు

లు: కాలు - కాలులు - కాళ్ళు

టు: గొంటు - గొంటులు - గొంట్లు

రు: గోరు - గోరులు - గోర్లు

౧౨౦. కొన్నిశబ్దములకు బహువచనము లేదు.

ఉదా:— పైఁడి - వెండి - కేలు - మొన్న - రేపు మొదలైనవి.

౧౨౧. కొన్ని శబ్దముల కేకవచనము లేదు.

ఉదా:—ఇరులు-కురులు-వడ్లు-పెసలు.

బహువచనమున మఱికొన్ని భేదములు:—

౧౨౨. మువర్ణాంత శబ్దములకు లు, ల, న, లు పరంబగునపుడు ము వర్ణలోపమును పూర్వాచ్చునకు దీర్ఘమును నగును. ఉదా:— పగడము - పగడాలు - పగడాన; చుట్టము- చుట్టాలు; మీసము - మీసాలు మొ॥

(మఱికొన్ని శబ్దముల కేకవచన బహువచన రూపములు)

| ఏకవచనము | బహువచనము | మఱియొకరూపము |
|---|---|---|
| విలుకాఁడు | విలుకాండ్రు | విలుకాఱు |
| చెయువు | చెయువులు | చెయువుఱు |
| చీటి | చీటులు | చీట్లు |
| తూఁడు | తూఁడులు | తూండ్లు |
| వజ్రము | వజ్రములు | వజ్రాలు |
| పేరు | పేరులు, పేళులు | పేళ్లు |
| కొడవలి | కొడవండులు | కొడవండ్లు |
| త్రాడు | త్రాడులు | త్రాళ్లు |
| ఊరు | ఊరులు, ఊళులు | ఊళ్లు |
| తడి | తడులు | తళ్లు |
| విల్లు | విల్లులు, విండులు | విండ్లు |
| మొగిలు | మొగిళులు, మొగిలులు | మొగిళ్లు |

| ఏక | బహు |
|---|---|
| పెండ్లి | పెండ్లిండ్లు |
| ఱేఁడు | ఱేండ్లు |
| మఱదలు | మఱదండ్రు |
| చెలియలు | చెలియండ్రు |
| గండడు | గండండ్రు |
| చెల్లెలు | చెల్లెండ్రు |

## అధ్యాయము ౫

## సమాసములు

౧. సమర్థములగు ననేకపదము లేకపదంబగుట సమాసము. (ప్ర)సిద్ధములైన వేర్వేరర్థములుగల పదము లొకపదమైనచో సమాస మనఁబడును.

ఉదా:—రామకృష్ణులు - రామభక్తి మొ॥

౨. తెనుఁగున సమాసములు సాంస్కృతికము, ఆచ్ఛికము, మిశ్రమునని మూఁడువిధములు.

3. సాంస్కృతికములు సిద్ధ, సాధ్య భేదముచే రెండు విధములు.

(అ) సిద్ధమన సంస్కృతపదములకు సంస్కృత లక్షణముచేఁ జేయఁబడిన సమాసము. సమాసాంతమున మాత్రము తెలుఁగు లక్షణముండును.

ఉదా:—సీతావల్లభుఁడు, గౌరీశంకరులు.

(ఆ) సాధ్యమనఁ దత్సమ పదములకుఁ దెలుఁగు లక్షణముచేఁ జేయఁబడిన సమాసము.

ఉదా:—తటాకపుజలము, ప్రభునాజ్ఞ.

౪. ఆచ్ఛికము కేవలాచ్ఛిక పదములకుఁ జేయఁబడిన సమాసము. ఉదా:—మాటనేర్పరి - నెలతాల్పు.

౫. మిశ్రమము ఆచ్ఛికములకుఁ దత్సమములకుఁ జేయఁబడిన సమాసము. ఉదా:—మంచిబాలుఁడు, ఱేనియాజ్ఞ

౬. అవ్యయీభావము, తత్పురుషము, బహువ్రీహి, ద్వంద్వంబు నని సమాసంబులెల్ల నాల్గువిధంబులఁ గలవు.

అవ్యయీభావము:—

౭. అవ్యయీభావ సమాసము పూర్వపదార్థ ప్రధానమై యుండును. ఉదా:—మధ్యేమార్గము - పెడతల.

తత్పురుషము:—

౮. ఉత్తరపదంబు నర్థము ప్రధానముగాఁ గలది తత్పురుషము. ఉదా:—రాజపురుషుఁడు - రామునాజ్ఞ.

౯. తత్పురుషము వ్యధికరణము, సమానాధికరణము నని రెండువిధములు.

(అ) (వ్యధికరణమున సమాసగత పదంబులలో నేపద మర్థము దానియందే యుండునుగాని యొక్క పదార్థమందే కలసియుండదు.)

౧౦. ద్వితీయాది విభక్త్యంతములకు మీఁదిపదముల తోడి సమాసము వ్యధికరణ మనంబడు.

ఉదా:—

నెలతాల్పు (నెలను దాల్చినవాఁడు) ద్వితీయా తత్పురుష.
నెలతక్కువవాఁడు (నెలచేతఁ దక్కువవాఁడు)-తృతీయా త.
దేవరమేలు (దేవరకొఱకు మేలు) చతుర్థీ తత్పురుష.
దొంగభయము (దొంగవలన భయము) పంచమీ త.
రామునిబాణము (రామునియొక్క బాణము) షష్ఠీ త.
మాట నేర్పరి (మాటయందు నేర్పుగలవాఁడు) సప్తమీ త.

౧౧. కానిది యను నర్థమిచ్చు నఞ్ తోడి సమాసము నఞ్ తత్పురుషము. ఉదా:—అజ్ఞానము (న+జ్ఞానము)
అన్యాయము (న+న్యాయము)

కర్మధారయము:—

౧౨. విశేషణంబునకు విశేష్యంబుతోడను, ఉపమానంబున కుపమేయంబుతోడను జేయఁబడు సమాసము సమానాధికరణం బనంబడు. దీనికే కర్మధారయ (Descriptive Compounds) మని పేరు.

(ఆ సమాస గత పదార్థముల కొక్కటియే యాధారముగాఁ గలది కావున సమానాధికరణమని చెప్పఁబడును.)

ఉదా:—సరసము + వచనము = సరసపువచనము, తెల్లగుఱ్ఱము, మంచి రాజు.

(ఇది విశేషణ పూర్వపదము, విశేష్యపూర్వపదము, విశేషణోభయపదము, సంభావనాపూర్వపదము, ఉపమాన పూర్వపదము, ఉపమానోత్తరపదము, మధ్యమ పదలోపము మొదలైన భేదములు కలిగియుండును.)

౧౩. విశేషణము పూర్వమందుఁ గలది విశేషణ పూర్వపద కర్మధారయము. ఉదా:—తెల్ల గుడ్డ.

౧౪. విశేష్యము పూర్వమందుఁగలది విశేష్యపూర్వ పద కర్మధారయము. ఉదా:—వైయాకరణఖసూచి.

౧౫. పూర్వోత్తరపదములు రెండును విశేణములు గాఁగలది విశేషణోభయపద కర్మధారయము.

ఉదా:—శీతోష్ణము, స్నాతానులిప్తుఁడు.

౧౬. సంజ్ఞావాచకము పూర్వమందుఁగలది సంభావనా పూర్వపద కర్మధారయము.

ఉదా:—గంగానది, వింధ్యశైలము.

౧౭. ఉపమానపదము పూర్వమందుఁ గలది యుపమాన పూర్వపద కర్మధారయము.

ఉదా:—చిగురుమోవి (చిగురుబోలినమోవి).

౧౮. ఉపమాన ముత్తరపదముగాఁ గలది యుపమానోత్తరపద కర్మధారయము.

ఉదా:—ముఖపద్మము (పద్మముఁబోలు ముఖము).

౧౯. సమసించు రెండు పదముల మధ్యనున్న పదము లోపించునది మధ్యపదలోపిసమాస మనఁబడును.

ఉదా:—జవ్వాదిసెట్టి (జవ్వాదిని అమ్ము సెట్టి).

౨౦. ఒకదాని ధర్మము, మఱియొకదానియం దారోపింపఁబడుచో రూపక సమాసమని పేరు.

ఉదా:—అజ్ఞానాంధకారము (అజ్ఞాన మనునదియే యంధకారము).

౨౧. కర్మధారయంబు సంఖ్యాపూర్వకం బయ్యేనేని ద్విగువనంబడు. ఉదా:—ముజ్జగములు - ముల్లోకములు.

౨౨. ద్విగువున నేకవచనంబు తఱచుగనగు. మిశ్రంబునఁగాదు. ఉదా:—ముచ్చిచ్చు, ముకాఁరు, ముప్పాతిక, మువ్విధములు, నలుదిశలు మొ॥

బహువ్రీహి :—

౨౩. సమాసములోని పదముల యర్థముకాక యితర పదార్థము ప్రధానముగాఁగలది బహువ్రీహి సమాసము.

ఉదా:—శీతకిరణుఁడు (శీతమైన కిరణములు కలవాఁడు).

౨౪. ఇదియుసమానాధికరణము, వ్యధికరణము, నఞ్ బహువ్రీహి, ఉపమాన బహువ్రీహి అని నాలుగువిధములు.

(అ) సమానాధికరణము ద్వితీయాది విభక్తులసంబంధముకలది. ఉదా:-ప్రాప్తానందుఁడు - (ద్వితీయాబహువ్రీహి)
లబ్ధవిజయుఁడు - (తృతీయాబహువ్రీహి)
దత్తాస్త్రుఁడు - (చతుర్థీబహువ్రీహి)
నిర్జనము - పంచమీబహువ్రీహి)
పీతాంబరుఁడు - (షష్ఠీబహువ్రీహి)
వీరపురుషము - (సప్తమీబహువ్రీహి)

(ఆ) వ్యధికరణము షష్ఠీ, సప్తమీ విభక్తులతో మాత్రముండును. ఉదా:-పద్మగంధి-(పద్మముయొక్క-గంధము కలది); చక్రపాణి - (చక్రము పాణియందుఁ గలవాఁడు.)

(ఇ) నఞ్ బహువ్రీహి. ఉదా:— అధనుఁడు - అభాగ్యుఁడు.

(ఈ) ఉపమానబహువ్రీహి. ఉదా:—చంద్రముఖి,

౨౫. తెలుఁగున స్త్రీ సమఘటితంబయి బహువ్రీహి చూపట్టెడు. ఉదా:—చలివెలుఁగు, వేవెలుఁగు, వేగంటి.

౨౬. తెలుఁగునందు బహువ్రీహిని సమాసాంత కార్యంబులు గానంబడియెడి.

ఉదా:—నలువ, గట్టువిలుతుఁడు, ముక్కంటి, మొ॥

౭౭. బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో మేనుశబ్దంబునకు "బోడి, బోణి" శబ్దంబులు పర్యాయంబున నాదేశంబులగు.

ఉదా:—చిగురు+మేను (కలది) = చిగురుఁబోడి, చిగురుఁబోణి.

౭౮. ద్వంద్వము:— ద్వంద్వము సమాసగతపదములన్నింటియర్థము ప్రధానముగాఁగలది. ఉ:-రామలక్ష్మణులు.

౭౯. ఇది ద్విపద ద్వంద్వము, బహుపదద్వంద్వము, ఇతరేతర ద్వంద్వము, సమాహార ద్వంద్వము, ఏకశేషము నని యైదు విధములు.

(అ) ద్విపదద్వంద్వము రెండుపదములు సమసించినది. ఉదా:—కాలుసేతులు, కూరగాయలు.

(ఆ) బహుపద ద్వంద్వము అనేకపదంబులు సమసించినది. ఉదా:—రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు.

(ఇ) ఇతరేతరద్వంద్వము ప్రత్యేకాన్వయముకలది.

ఉదా:—రామకృష్ణులు మహాశూరులు. (రాముఁడు మహాశూరుఁడు, కృష్ణుఁడును మహాశూరుఁడని యర్థము.)

(ఈ) సమాహార ద్వంద్వము సమూహార్థమే ముఖ్యముగాఁగలది. ఉదా:—రథగజతురగపదాతులు.

(ఉ) ఏకశేషము - ఏకరూపముగల యనేకపదములు సమసించుచో నందొకశబ్దమే మిగిలిన దానికి బహువచన ప్రత్యయము వచ్చును.

ఉదా:—శివ + శివుఁడు = శివులు; రాముఁడు + రాముఁడు + రాముఁడు = రాములు, (శ్రీరామ పరశురామ బలరాములు); అర్జునుఁడు + అర్జునుడు = అర్జునులు(పాండవ కార్తవీర్యార్జునులు)

౩౦. ఆచ్ఛిక ద్వంద్వంబునఁ బూర్వపదము స్త్రీ సమంబగును. ఉదా:—తల్లిదండ్రులు, అన్నదమ్ములు.

౩౧. కొండొకచో ద్వంద్వంబునఁ బూర్వపదాంత ము వర్ణంబు లోపించును.

ఉదా:—అందము + చందము = అందచందములు.

౩౨. విభక్తిప్రత్యయము లోపించిన సమాసమును లుక్సమాసమందురు. ఉదా:—వృక్షమూలము, నామాట.

౩౩. విభక్తిప్రత్యయము లోపింపనిసమాసము నలుక్సమాసమందురు. ఉదా:—వనేచరుఁడు, సీతతోడి చెలిమి.

## అధ్యాయము ౬

## క్రియలు (VERBS)

౧. వ్యాపారమును బోధించు పదములు క్రియలు.

ఉదా:—పోషించు, వచ్చు, పోవు. మొ॥

౨. ప్రత్యయములతోఁ గూడకమున్న క్రియకు ధాతువని పేరు. ధాతువులు ఉకారాంతములుగా నుండును.

ఉదా:—కొట్టు, చేయు, చూచు. మొ॥

౩. క్రియలు తత్సమములు, దేశ్యములు నని రెండు విధములు. తత్సమక్రియల యంతంబున "ఇంచు" అనునది చేర్పఁబడి యుండును. ఉదా:—సేవించు, పోషించు. మొ॥

౪. ఈ "ఇంచు" కొన్ని దేశ్యక్రియలగు నంగలాదులకును స్వార్థంబునం గానంబడుచున్నది.

ఉదా:—అంగలించు, ఆరగించు, పరికించు.

(అంగల, అడక, ఆరగ, ఆవుల, ఉంక, ఉగ్గల ఓసర, కార, గాల, జాడ, తిలక, తులక, పంక, పరిక, పలవ, అప్ప, ఒప్ప, ఆల, అగ్గ, మొదలైనవి అంగలాదులు.)

౫. తత్సమములగు అకర్మక ధాతువుల తుది యించునకు "ఇల్లు" ఆదేశమగును. ఉదా:—రంజిల్లు, వర్ధిల్లు.

౬. ధాతువు మొదటివర్ణము గురువయ్యెనేని "ఇల్లు" లకారద్విత్వమునకు లోపము విభాషనగును.

ఉదా:—వర్ధిల్లు, వర్ధిలు; భాసిల్లు, భాసిలు.

౭. గురువర్ణయుతములుకాక, యకారాంతములు కాక యొకటి రెండచ్చులుమాత్రము కలిగిన ధాతువులకు వికల్పముగా నించునకు ముందుగ "ఇయ్" ఆగమమగును.

ఉదా:—భుజించు, భుజియించు; గుణించు, గుణియించు; ధరించు, ధరియించు మొ॥

౮. ఇంచు పరంబగుచో సంస్కృతధాతువు తుది ఇకారమునకు "అయ్" ఆదేశంబగు.

ఉదా:—జి + అయ్ + ఇంచు = జయించు.

౯. ఇంచు పరంబగుచో సంస్కృత ధాతువు తుది ఉకారమునకు "అవ్" ఆదేశంబగు.

ఉదా:—ద్రు + అవ్ + ఇంచు = ద్రవించు.

౧౦. ఇంచు పరంబగుచో సంస్కృతధాతువు తుది ఋకారమునకు "అర్" ఆదేశంబగు.

ఉదా:—ధృ + అర్ + ఇంచు = ధరించు.

౧౧. నిద్ర, నామంబులకు అయుగాగమంబు లేదు.

ఉదా:— నిద్ర + ఇంచు=నిద్రించు, శయనించు.

౧౨. ఇంచు పరంబగుచో "ఛిద్" మొదలగువానికి గుణంబగు. ఉదా:—ఛిద్ + ఇంచు = ఛేదించు.

ఘుష్ + ఇంచు = ఘోషించు.

పుష్ + ఇంచు = పోషించు.

౧3. లిఖ, భుజ, రుచ, కృశంబులకు గుణంబు లేదు; స్పృశికి విభాషనగు. ఉదా:—లిఖించు (గుణము లేదు)

స్పృశించు (గుణము లేదు)

స్పర్శించు (గుణము)

౧౪. క్రియలు సకర్మకములు, అకర్మకములని రెండు విధములు. కర్మమును గోరునవి సకర్మకములు.

ఉదా:—విను,తిను, పఠించు, మొ॥

౧౫. కర్మమును గోరనివి అకర్మకములు.

ఉదా:—వచ్చు, వెళ్లు, పోవు, ఉండు, మొ॥

౧౫. సకర్మకక్రియలకు కర్త్రర్థక ప్రయోగము, కర్మార్థక ప్రయోగము నని రెండువిధముల ప్రయోగము లుండును.

(అ) కర్త ప్రథమావిభక్తియందుండునది కర్త్రర్థక ప్రయోగము. ఉదా:-ఉపాధ్యాయుఁడు పాఠమును జెప్పెను.

(కర్తయనఁగాఁ క్రియయొక్క వ్యాపారము నాశ్రయించినది.)

(ఆ) కర్మ ప్రథమావిభక్తియం దుండునది కర్మార్థక ప్రయోగము. ఉదా:—గురునిచే బాలుఁడు శిక్షింపఁబడియె.

౧౬. క్రియ సమాపకము, అసమాపకము నని రెండు విధములు.

(అ) సమాపకము (Finite) :—కార్యము పూర్తిగా ముగిసినట్లు తెల్పునది సమాపకక్రియ.

ఉదా:—నీవు చదువుచున్నావు, నేను వినుచున్నాను.

(ఆ) అసమాపకము (Infinite) :—వాక్యముపూర్తిగా ముగియలేదని తెల్పునది అసమాపక క్రియ.

ఉదా:—కొట్టి, కొట్టక, చేసి, చేయక, చేసినన్ మొ॥

## సమాపక క్రియలు

౧౭. సమాపకక్రియ తెలుఁగున వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మార్థక కాలము అని కాలమునుబట్టి నాలుగు విధములు.

(అ) వర్తమానకాలము (Present) జరుగుచున్న కాలమును దెల్పునది. దీనిని లట్టందురు.

ఉదా:—చదువుచున్నాఁడు - ఆడుచున్నాను.

(ఆ) భూతకాలము (Past) జరిగినకాలమును దెల్పును. దీనిని లిట్టందురు. ఉదా:—చేసెను, చేసితిని. మొ॥

(ఇ) భవిష్యత్కాలము (Future) రాఁబోవుకాలమును దెల్పును. దీనిని లృట్టు అందురు.

ఉదా:—చేయఁగలఁడు—పోఁగలవు.

(ఈ) తద్ధర్మాద్యర్థకము (Indefinite) పై మూఁడు కాలములకంటె వేఱై ఆమూఁడు కాలములయందుపయోగింపఁబడునది. దీనిని లాట్టు అందురు.

ఉదా:—పురుగులు ప్రాకును. చేపలు ఈదును.

౧౫. ఆదిపదముచే తచ్ఛీల సంభావనా, సంప్రశ్న, సాతత్య, వర్తమాన, భావి, ఆశీరాదులు గ్రాహ్యములు.

ఉదా:—(౧) తచ్ఛీలము - నీరు పల్లమునకుఁ బ్రవహించును.
(౨) సంభావన (ఊహ)-రాముఁడిపుడిటకు వచ్చును.
(౩) సంప్రశ్న - వచ్చెదవా? పోయెదవా?
(౪) సాతత్యము (ఎప్పుడునుండునది) - దేవుఁడంతట నిండియుండును.
(౫) వర్తమానము - ఇంతకు వాఁడు వినఁడయ్యెడి.
(౬) భావి - ఏకాదశి రేపువచ్చును.
(౭) ఆశీస్సు - నీకు శుభము కలుఁగుగాక!

౨౦. కర్తనుబట్టి క్రియలకు ప్రథమ, మధ్యమ, ఉత్తమ లను మూఁడు పురుష లేర్పడుచున్నవి.

(అ) ప్రథమపురుష (First person) సర్వనామమేని, యే నామవాచకమేని కర్తగాఁగలది. ప్రథమపురుష క్రియ యగును. ఉదా:—వాఁడువచ్చె. వారువచ్చిరి. వానకురిసెను. గరుఁడుఁ డెగిరెను. రాముఁడు చదువుచున్నాఁడు.

(ఆ) మధ్యమపురుష (Second person) సర్వనామము కర్తగాఁగలది మధ్యమపురుష క్రియయగును.

ఉదా:—నీవు వచ్చితివి; మీరువచ్చితిరి.

(ఇ) ఉత్తమపురుష (Third person) సర్వనామము కర్తగాఁగలది ఉత్తమపురుషక్రియ యగును.

ఉదా:— నేనువచ్చితిని; మేమువచ్చితిమి.

౨౧. ప్రథమ పురుషమునఁదప్ప లింగభేదము లేదు. ప్రతిపురుషమునకును ఏకవచన బహువచన భేదముండును.

ఉదా:—ప్రథమ-మహత్తు-వాడు వచ్చుచున్నాఁడు.
మహతి-ఆమెవచ్చుచున్నది.
అమహత్తు-అది వచ్చుచున్నది.

౨౨. ధాతువునకు ప్రథమ మధ్యమోత్తమ పురుషల యేకవచన బహువచనములందు వరుసగ "ఁడు రు" లు "వు రు" లు "ను, ము" లు నగు. ఉదా:—వండు+ఁడు.

౨౩. ఉదంతంబగు ధాతువునకు వర్తమానకాలంబున "ఉన్న" శబ్ద మనుప్రయుక్తంబగు.

ఉదా:—వండు+ఉన్న+ఁడు.

౨౪. ధాతువునకు "ఉన్న" శబ్దంబు పరంబగునపుడు చు వర్ణకంబగు. ఉదా:—వండు+చు+ఉన్న+ఁడు.

౨౫. ది, వి, యనునవికాక తక్కిన క్రియాప్రత్యయములు పరములగునపుడు "ఉన్న" కు దీర్ఘంబగు.

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ఉదా:-ప్రథమ. | వంఘచున్నాఁడు. | వండుచున్నారు. |
| మధ్యమ. | వండుచున్నావు. | వండుచున్నారు. |
| ఉత్తమ. | వండుచున్నాను. | వండుచున్నాము. |

౨౬. అమహదర్థంబునఁ బ్రథమపురుష "ఁడు, రు" లకు "దు, వు" లగు. "ఉన్న" యనుబంధమైనపుడు "ది, వి" యగు.

ఉదా:—పక్షి తిరుగుచున్నది.
పక్షులు తిరుగుచున్నవి.

౨౭. భూత తద్ధర్మకాలంబులందుఁ బ్రథమపురుషైకవచన "ఁడు" ప్రత్యయంబునకు వరుసగా "ఎను, ను" వర్ణకంబులగు. ఉదా:—వండు+ఎను=వండెను.
వండు + ను=వండును.

౨౮. భూతార్థంబున ధాతువు తుదియుత్వంబున కిత్వంబగు. ఉదా:—వండు+ఇ=వండి

౨౯. ఇకారంబు మీఁది కు, ను, వు, లయు, క్రియావిభక్తులయు ఉత్వంబునకు ఇత్వంబగు.

ఉదా:—వండి+రు=వండిరి.

౩౦. భూతార్థంబున ధాతువునకు మధ్యమోత్తమ పురుషప్రత్యయంబు లగు "వు, రు, ను, ము" లు పరంబగు నపుడు "తి" వర్ణంబంతాగమంబగు.

ఉదా:—వండు+తి+వు =వండితివి (భూత, మ, ఏ, వ.)

వండు+తి+రు =వండితిరి (భూత, మ, బ, వ.)

వండు+తి+ను =వండితిని (భూత, ఉ, ఏ, వ.)

వండు+తి+ము=వండితిమి (భూత, ఉ, బ, వ.)

౩౧. భవిష్యదర్థంబున ధాతువునకు "ఁగల" అను బంధంబగు. అగుచో ధాతువు తుదియుత్వంబున కత్వంబగు.

ఉదా:— వండు+ఁగల+ఁడు=వండఁగలఁడు.

వండు+ఁగల+రు=వండఁగలరు.

వండు+ఁగల+వు=వండఁగలవు.

వండు+ఁగల+రు=వండఁగలరు.

వండు+ఁగల+ను=వండఁగలను.

వండు+ఁగల+ము=వండఁగలము.

అమహదర్థంబున దు, వు, లురాఁగా, 'పక్షి యెగురఁ గలదు - పక్షులు ఎగురఁగలవు' అని యగును.

౩౨. తద్ధర్మార్థంబున "దు, వు, రు, ను, ము" లు పరంబగునపుడు ధాతువు తుదిని "దు" వర్ణమాగమంబగు.

ఉదా:—

తద్ధర్మార్థకము

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమపురుష | వాఁడు వండును | వారు వండుదురు |
| మధ్యమపురుష | నీవు వండుదువు | మీరు వండుదురు |
| ఉత్తమపురుష | నేను వండుదును | మేము వండుదుము |

33. ప్రథమైకవచన ను వర్ణకంబు పరంబగునపుడు తద్ధర్మార్థంబున ధాతువు తుదను "ఎడు" "ఎడి" ఆగమంబులు బహుళంబుగానగు.

ఉదా:—వండు + ఎడు + ను = వండెడును.

వండు + ఎడి + ను = వండెడిని.

3౪. తద్ధర్మార్థంబున 'రు, వు, రు, ను, ము' లు పరంబగునపుడు ధాతువుతుదను "ఎద" ఆగమంబు బహుళంబుగానగు.

ఉదా:—

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్రథమపురుష | వాఁడు వండెడును<br>వాఁడు వండెడిని<br>వాఁడు వండును | వారు వండెదరు |
| మధ్యమపురుష | నీవు వండెదవు | మీరు వండెదరు |
| ఉత్తమపురుష | నేను వండెదను | మేము వండెదము |

3౫. భూత తద్ధర్మార్థంబుల మధ్యమపురుషైకవచనంబున వు వర్ణకంబు వకారంబునకు లోపంబు విభాషనగు.

ఉదా:—నీవువండెదవు-వండెదు, వండుదువు, వండుదు.

3౬. తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు భూత తద్ధర్మార్థంబుల ప్రథమ పురుష బహువచనంబున కేకవచనంబగు. ఉదా:—చిలుకలు పలికెను (భూత)

చిలుకలు పలుకును (తద్ధర్మ)

3౭. ఆశీ, శ్లాఘ, సంప్రార్థనంబుల ధాతువు తుదను ద్రుతాంతంబులు "ఎడు, త" వర్ణకంబులగు.

ఉదా:—ఆశీస్సు:-మీకు మేలు కలిగెడును.
మీకు మేలు కలుగుతను.
శాపము:-నీకు రాక్షసత్వంబు కలిగెడును.
నీకు రాక్షసత్వంబు కలుగుతను.
సంప్రార్థనము:-హరి ననుఁ గాచెడున్.
హరి ననుఁ గాచుతన్.

౩౮. 'ఎడు, త' ల ద్రుతంబునకు అచ్చు పరంబగు నపుడు మకారంబగు.

ఉదా:— కలిగెడును + అనియె = కలిగెడుమనియె.
కలుగుతను + అనియె = కలుగుతమనియె.

౩౯. ఆశీరాదుల మధ్యమ వు, రు, లకు ము, ఁడు, లగు. ఉదా:—

ఆశీస్సు - కృతార్థుఁడవగుము, కృతార్థుల రగుఁడు.
శాపము - రాక్షసుఁడ వగుము, రాక్షసుల రగుఁడు.
సంప్రార్థనము - రక్షింపుము, రక్షింపుఁడు.
విధి - చెప్పినది చేయుము, చెప్పినది చేయుఁడు.

౪౦. ధాతువునకుఁ విధియందుఁ గ్రియాప్రత్యయము లకు మాఱుగా "అది" యను తచ్ఛబ్దంబును దానిముందు నువర్ణాగమంబునగును.

ఉదా:—నా చెప్పుదానిఁ జేయునది. నీవు వంటవండునది - (వండవలెనని భావము).

౪౧. ఉభయప్రార్థనంబున దువర్ణాగమంబు నుత్వంబున కత్వంబగు. ఉదా:—మనము వండుదము - ఆడుదము మొ॥

౭౨. వ్యతిరేకంబున "ఁడు, రు, వు, రు, ను, ము," లు పరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

ఏ. వ. బ. వ

ఉదా:—వాఁడు వండఁడు, వారు వండరు-(వ్య, ప్ర)
నీవు వండవు, మీరు వండరు (వ్య, మ)
నేను వండను, మేము వండము (వ్య, ఉ)

౭౩. వ్యతిరేకంబున మధ్యమ ము, ఁడు, లు పరంబగునపుడు ధాతువు తుదను "కు" ఆగమంబగు - అగుచో ధాతువు నుత్వంబున కత్వంబగు.

ఉదా:—నీవు వండకుము, మీరు వండకుఁడు.

౭౪. సంప్రార్థనాద్యర్థంబుల మధ్యమ "ము, ఁడు" లకు అదాదు లనుప్రయుక్తంబులగు.

ఉదా : — వండుము + అ = వండుమ; వండుమా, వండుమి, వండుమీ, వండుఁడ, వండుఁడా, వండుఁడి, వండుఁడీ.

(అ, ఆ, ఇ, ఈ, ఎ, ఏ, ఒ, ఓ, అన్న, అమ్మ, అయ్య మొదలైనవి అదాదులు)

౭౫. ఎదాదులను ప్రయుక్తంబులగునపుడు మధ్యమ "ము, ఁడు" లకు "వు, రు" లగు - అగుచో ధాతువు నుత్వంబున కత్వంబగు.

ఉదా:— వండు + ము + ఎ = వండవె, వండవే, వండరె, వండరే, (వ్యతిరేకంబున) వండకువె, వండకువే, వండకురె, వండకురే.

(ఎ, ఏ, ఓ, ఓీ, అన్న, అమ్మ, అయ్య, మొదలగునవి ఎదాదులు)

౪౯. వ్యతిరేకంబునం దన్నాదులు పరంబగునపుడు వు, రు లు రావు. ఉదా:—త్రిప్పకుమన్న, చదువకుడయ్య.

౪౭. ప్రార్థనాదులందు "ఇమ్ము" నకు "ఈ" విభాషనగు. ఉదా:—పోనిమ్ము—పోనీ. కానిమ్ము—కానీ.

౪౮. ఖండబిందుపూర్వదిసిద్ధ చకారంబునకును, ఇంచు చకారంబునకును, మధ్యమపురుష "ము, ఁడు" లు పరంబులగునపుడును వ్యతిరేకార్థంబునను తుమున్నాద్యర్థంబునను పకారంబు ప్రాయికంబుగనగు.

ఉదా:—తలఁచు, తలంపుము, తలఁపక, తలఁపన్
రంజించు, రంజింపుము, రంజింపక, రంజింపన్

౪౯. ఆగమ దువర్ణంబు పరంబగునపుడు పూర్ణబిందు పూర్వక చకారంబునకు పకారంబు విభాషనగు.

ఉదా:—దంచుదురు, దంపుదురు; ఆకర్ణించుదురు, ఆకర్ణింతురు, ఆకర్ణింపుదురు.

౫౦. అగు, వచ్చు, చొచ్చు, చూచులకు మధ్యమ పురుష "ము, ఁడు" లును, వ్యతిరేకార్థక "క, కు" వర్ణకంబులును బరంబులగునపుడు కా, రా, చొరు, చూడులగు.

ఉదా:—కాఁడు, కాక, కాకుము, కమ్ము
రాఁడు, రాక, రాకుము, రమ్ము,

౫౧. వ్యతిరేకంబున వలచునకు ఒల్ల విభాషనగు.

ఉదా:—ఒల్లఁడు, ఒల్లరు, ఒల్లదు, ఒల్లవు మొ॥

౫౨. "చుదు" లకు తు వర్ణం బేకాదేశంబు బహుళంబుగనగు. ఉదా:—చూచు + దురు = చూతురు
పిలుచు + దురు = పిలుతురు
వత్తురు, చొత్తురు అనుచో నిత్యంబు.

౫౩. పిలుచు మొదలగు వానికి "ము, ఁడు"లు పరంబగునపుడును, వ్యతిరేకార్థంబునను అంతిమాక్షర లోపంబు బహుళంబుగ నగు.

ఉదా:—పిలుము, పిలుఁడు, పిలఁడు, (పక్షంబున) పిలువుము, పిలువుఁడు పిలువఁడు మొ॥

౫౪. ఆగమాన్య చకారంబుల క ద్విరుక్తంబులకు మధ్యమపురుష "ము, ఁడు" లు పరంబగునపుడును వ్యతిరేకంబునను పవలగు.

ఉదా:—(ఆగమమునకు) వచింపుము, వచింపుఁడు
వచింపక, వచింపకుము
(అన్యమునకు) పిలువుము, పిలువుఁడు
పిలువక, పిలువఁడు.

౫౫ క్రియాపదంబులమీఁద ఆ, ఏ, వర్ణములు చేరుటచే ప్రశ్నార్థకంబులగు. ఉదా:—వచ్చితివా? వచ్చితిరే?

౫౬. క్రియాపదంబులమీఁద "ఒ, ఓ" లు చేరుచో సందేహార్థకంబులగు. ఉదా:—ఎఱుంగునో; ఎఱుంగదో.

౫౭. క్రియాఫలము పరునిఁజెందునేని క్రియ పరస్మైపదమనియుఁ, గర్తను జెందునేని ఆత్మనే పదమనియుఁ జెప్పఁబడును. ఉదా:—(పరస్మైపదము) వండుచున్నాఁడు, వండెను, వండఁగలరు. మొ॥

ఆత్మనేపదము:—

౯౭. ఆత్మనేపదమున ధాతువునకు "కొను" ధాతు వనుప్రయుక్తంబగు. అగుచో ధాతువు తుదియుత్వంబున కిత్వంబు విభాషనగు.

ఉదా:—వండు + కొను = వండికొను, వండుకొను; పోషించికొను, పోషించుకొను.

౯౮. కర్మార్థమున ధాతువునకు "పడు" అను ప్రయుక్తంబగు. అగుచో ధాతువు తుది యుత్వంబున కత్వంబగు. ఉదా:—పోషించుకొనఁ బడుచున్నాఁడు.

పోషింపఁబడుచున్నాఁడు.

౯౯. ఇకారంబును, ఎను, ఎడి, ఎడు లును బరంబగు నపుడు ధాతువు యకారంబునకు సకారంబగు.

ఉదా:—చేయు + కొను = చేసికొను, చేసి, చేసిరి, చేసెను, చేసెడు, చేసెడి.

ప్రేరణార్థకంబు:—

౧౦౦. సర్వంబునకుఁ బ్రేరణంబున "ఇంచు" ఆగమం బగు. ఉదా:—పచించు + ఇంచు = పచింపించు.

౧౦౧. అసంయుక్తంబులగు న, ల, డ, రేఫంబు లంత మందుఁగల యాచ్ఛిక ధాతువులకుఁ బ్రేరణంబున "చు" ఆగమంబు బహుళముగానగు.

ఉదా:—పూను, పూనుచు, పూనించు.

మసుగుడు, మగుడుచు, మగిడించు.

విను, వినుచు, వినిపించు.

౬౩. మానులోనగు వానికిఁ బ్రేరణంబున "పు" ఆగమంబును బహుళంబుగా నగు; ఇంచు రాదు.

ఉదా:— మాను, మానుచు, మానుపు;
మను, మనుచు, మనుపు.

౬౪. ప్రేరణేంచు పరంబగునపుడు చకారంబునకు పకారంబగు. ఉదా:—వలచు, వలపించు.

౬౫. ఇత్వంబుకాని ఎత్వంబుకాని పరమైనచో అద్యంబుకాని ఉత్వంబున కిత్వంబగు.

ఉదా:—మగుడు, మగిడించు, పిలుచు, పిలిపించు.

౬౬. అన్వాదులకించు పరమగునపుడు పు వర్ణమాగమంబగు. ఉదా:— అను+పు+ఇంచు = అనిపించు.

(అను, తిను, విను, కను, అన్వాదులు)

౬౭. మానునకు వైకల్పికంబు.

ఉదా:—మానిపించు, మానించు.

౬౮. అడ్డాదులకించు పరంబగునపుడు "గు" వర్ణము కొన్నిటి కాగమంబును, గొన్నిటి కంతాదేశంబునగు.

ఉదా:—అడ్డము, అడ్డగించు (అడ్డము, ఓర, చిత్తము, పంతము, పెల్ల, బోర, చుట్టము, మేళము, మొదలైన వడ్డాదులు.)

౬౯. అది అప్పాదులకు విభాషనగు.

ఉదా:—అప్పగించు, అప్పించు.

(అప్ప, ఒప్పు, పల్లము, కోపము మొదలైనవప్పాదులు)

౭౧. ఆడోడుకూడుల డకారంబునకు "చు" పరంబగునపుడు రేఫంబగు. ఉదా:—ఆడు, ఆరుచు, ఆడించు.
ఓడు, ఓరుచు, ఓడించు.

౭౧. చెడునకుఁ బ్రేరణంబున "చు, పు" ఆగమంబులును, డాకు అలఘు రేఫంబునగు. ఉదా:—చెఱుచు, చెఱుపు.

౭౨. పడునకు "చు" ఆగమంబును, డాకు అలఘు రేఫంబునగు. ఉదా:—పఱుచు.

౭౩. శబ్దపల్లవంబగు పడునకు "ఇంచు" విభాషనగు. అగుచో డాకు లఘు రేఫంబునగు.

ఉదా:—వెలువడు, వెలువరించు.
చొప్పడు, చొప్పరించు.

౭౪. పరస్మైపద కర్తృపదము ప్రేరణమునఁ గర్మవాచకమగును.

ఉదా:—రాముఁడు వినియె, దశరథుఁడు రాముని వినిపించె.

౭౫. అకర్మకక్రియ ప్రేరణంబున సకర్మకమగును.

ఉదా:—రావణుఁడోడెను - (అకర్మకము)
రాముఁడు రావణునోడించెను -(సకర్మకము)

౭౬. సకర్మకక్రియ ప్రేరణంబునఁ గొండొకచో ద్వికర్మకంబగు.

ఉదా:—కృష్ణుఁడు పాఠముఁ జదివెను (సకర్మక)
గురువు శిష్యుని పాఠముఁ జదివించెను (ద్వికర్మకము)

౭౭. చుప్పుగాగమంబులు పరంబగుచో ఇత్వంబున కుత్వంబగు. ఉదా:—బిగియు, బిగుచు; తడియు, తడుపు.

౭౮. ఆఁగు ప్రభృతు లుభయగణంబులు.

ఉదా:—ఆఁగు, ఆఁచు, ఆఁపు, ఆఁగించు.

౭౯. ప్రేరణంబునందలి యించు మీఁద నించు లేదు. (అనఁగా యితరాగమములమీఁద నించు రావచ్చును.)

ఉదా:—నోచ్చు, నోంచు, నోప్పించు.

మానుచు, మానిపించు.

ప్రయోగములు:—

(అ) పరస్మైపద కర్త్రర్థకము - పోషించుచున్నాఁడు.
(ఆ) పరస్మైపదకర్మార్థకము-పోషింపఁబడుచున్నాఁడు.
(ఇ) ఆత్మనేపద కర్త్రర్థకము - పోషించుకొనుచున్నాఁడు.
(ఈ) ఆత్మనేపదకర్మార్థకము-పోషించుకొనఁబడుచున్నాఁడు.
(ఉ) ప్రేరణకర్త్రర్థకము - పోషింపించుచున్నాఁడు.
(ఊ) ప్రేరణకర్మార్థకము-పోషింపింపఁబడుచున్నాఁడు.
(ఋ) ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము-పోషింపించు కొనుచున్నాఁడు.
(ౠ) ప్రేరణాత్మనేపద కర్మార్థకము - పోషింపించు కొనఁబడుచున్నాఁడు.

౮౦. క్రియలు సాధారణక్రియలు, నిపాతక్రియలు అని రెండువిధములు.

(అ) ధాతువు తుదను దుత్రసహిత అకారమును ము, ఁడు వర్ణకములును జేర్చుటవలనఁ గ్రమముగాఁడుమున్నా

ద్వ్యర్థకమును, ప్రార్థనార్థకమును నేర్పఱచునవి సాధారణ క్రియలు (Regular Verbs).

| ధాతువు | తుమున్నాద్యర్థకము | ప్రార్థనార్థకము |
|---|---|---|
| పోషించు | పోషింపన్ | పోషింపుము, పోషింపుఁడు. |
| భరించు | భరింపన్ | భరింపుము, భరింపుఁడు. |

(ఆ). నిపాతక్రియలు (Irregular Verbs) తుమున్నాద్యర్థకమందును, ప్రార్థనార్థకమందును వేఱురూపములను పొందునవి. ఉదా:—

| ధాతువు | తుమున్నాద్యర్థకము | ప్రార్థనార్థకము |
|---|---|---|
| అగు | కాన్ | కమ్ము, కండు |
| వచ్చు | రాన్ | రమ్ము, రండు. |
| చొచ్చు | చొరన్ | చొరుము, చొరుఁడు. |
| ఇచ్చు | ఈన్, ఈయన్, ఇయ్యన్ | ఇమ్ము, ఇండు. |
| నొచ్చు | నోన్, నోవన్, నొవ్వన్ | నొవ్వుము, నొవ్వుఁడు. |
| కను | కనన్, కానన్ | కనుము, కనుఁడు. |
| పిలుచు | పిలువన్ | పిలుము, పిలుఁడు, పిలువుము, పిలువుఁడు. |

౮౧. ప్రేరణార్థకము సమరూప క్రియలు భిన్నరూప క్రియలని రెండువిధములు.

(అ) సమరూపక్రియలు ధాతువు తుదను ఇంచు చేరుటవలన నేర్పడునవి. రూపభేదముల నొందవు.

ఉదా:—పోషించు, పోషింపించు, కొట్టు, కొట్టించు

(ఆ) భిన్నరూపక్రియలు పైరీతిని గాక ఇంచు, చు, పు, మొదలగు ప్రత్యయములను జెంది పెక్కు రూపముల నుండునవి.

ఉదా:—రంజిల్లు - రంజించు; అడఁగు - అడఁచు.

కొన్ని భిన్నరూపక్రియలు—

| స్వార్థకము | ప్రేరణము | స్వార్థకము | ప్రేరణము |
|---|---|---|---|
| పూను | పూనుచు, పూనించు | తేలు | తేలుచు, తేలించు |
| కుదురు | కుదురుచు, కుదిరించు | విను | వినుచు, వినిపించు |
| అను | అనిపించు | తిను | తినుపించు |
| కను | కనుపించు-కానిపించు | మెచ్చు | మెచ్చించు, మెప్పించు |
| మాను | మానుచు-మానుపు-మానిపించు-మానించు. | వచ్చు | రావించు,రప్పించు |
| | | నొచ్చు | నొప్పించు |
| డిగు | డిగించు-డించు | తునుఁగు | తుంచు |
| మునుఁగు | మునుచు-ముంచు | కలఁగు | కలఁచు, కలంచు |
| ఉడుగు | ఉడుపు-ఉడిగించు | రేఁగు | రేచు, రేపించు రేపు |
| ఆఁగు | ఆఁచు-ఆఁపు - ఆగించు | చొచ్చు | చొనుపు, చొప్పించు |
| పాయు | పాచు - పాపు | చచ్చు | చంపు |
| నిలుచు | నిలువరించు-నిలుపు | కొను | కొలుపు |
| ఆడు | ఆడుచు-ఆడించు | | |

## అసమాపక క్రియలు

౮౨. నామాకాంక్షములు, క్రియాకాంక్షములు నని యసమాపకములు రెండు విధములు.

### నామాకాంక్షములు

౮౩. క్రియాజన్యవిశేషణములే నామాకాంక్షములు. (వానివలన విశేష్యము లాకాంక్షింపఁబడును గాన వానికి నామాకాంక్షములని పేరు.) ఉ:-చదివెడు రాముఁడు.

౮౪. క్రియాజన్యవిశేషణము లైదు విధములు. ఏడు రూపములు.

(అ) వర్తమానార్థక విశేషణము - శత్రర్థకరూపము తుదను "ఉన్న" చేర్చుటచే నగును. ఉ:—పోషించుచున్న.

(ఆ) భూతార్థక విశేషణము:— క్త్వార్థకరూపము తుదను నకారము చేర్చుటవలనఁ గలుగును. ఉదా:—వండిన.

(ఇ) భవిష్యదర్థక విశేషణము:—ధాతువునకు 'ఁగల' యనునది చేర్చుటవలనఁ గలుగును.

ఉదా:—పోషింపఁగల, చదువఁగల. మొ॥

(ఈ) తద్ధర్మార్థక విశేషణము -ఇందు మూఁడురూపములు ధాతువు తుదను "ఎడు, ఎడి" "ఉ" వర్ణకములు చేర్చుటచేఁ గలుగును. ఉదా:— పోషించెడు, పోషించెడి, పోషించు.

(ఉ) వ్యతిరేకార్థక విశేషణము:— నివర్ణకము చేర్చుటవలన నగును. ఉదా:—పోషింపని.

### క్రియాకాంక్షములు

౮౫. అసంపూర్ణములై సంపూర్ణక్రియల నపేక్షించు క్రియలకుఁ గ్రియాకాంక్షములని పేరు. ఇవి ఐదువిధములు.

(అ) క్త్వార్థకము:—ధాతువు తుదిని "ఇ" ప్రత్యయము చేరుటచేఁ గలిగినది.

ఉదా:—వచ్చు-వచ్చి, పోషించు-పోషించి.

(ఆ) వ్యతిరేకక్త్వార్థకము:—వ్యతిరేకార్థమున ధాతువునకు "అక" ప్రత్యయము చేరుటచేఁ గలిగినది.

ఉదా:—పోషింపక, కొట్టక మొ॥

(ఇ) తుమున్నాద్యర్థకము:—ధాతువు తుదను "అన్, ఁగన్, ఁగాన్" అను ప్రత్యయములు చేరుటచే నగును.

ఉదా:—కొట్టన్, కొట్టఁగన్, కొట్టఁగాన్.

(ఈ) శత్రర్థకము:—వర్తమానార్థమున ధాతువునకు "చున్" ప్రత్యయము చేరుటచే నగును.

ఉదా:—పోషించుచున్, కొట్టుచున్.

(ఉ) ఆనంతర్యార్థకము:—ఆనంతర్యార్థమున ధాతువునకు "డున్" ప్రత్యయము చేర్చుటచేఁ గలుగును.

ఉదా:—పోషించుడున్, కొట్టుడున్.

ధాత్వర్థకము లేక భావార్థకము:—

౧౯. ధాత్వర్థకబోధకంబై "ట" వర్ణకంబు ధాతువునకగు. (దీనినే భావార్థక ప్రత్యయమందురు.)

ఉదా:—వండుట, పోషించుట మొ॥

౨౭. వ్యతిరేక భావార్థంబున మివర్ణకంబగు. అగుచో ధాతువు తుది యుత్వంబున కత్వంబగు.

ఉదా:—వండు+మి=వండమి, పోషింపమి.

౮౮. భావార్థక, వ్యతిరేక భావార్థక రూపములు సుబంతములువోలె విభక్తి ప్రత్యయములఁబొంది నామవాచకములగును. ఉదా:—వండుటచేతన్, వండమివలనన్ మొ॥

౮౯. కొఱకు, కంటె ప్రత్యయములు పరంబగునపుడు "ట" వర్ణకంబునకు లోపంబు వైకల్పికంబు.

ఉదా:—వండుటకొఱకున్, వండుకొఱకున్, వండుట కంటెన్, వండుకంటెన్.

౯౦. పురార్థకంబుల యోగంబున ధాతువునకు "క" వర్ణకంబగు, అగుచో ధాతువు తుదియుత్వంబున కత్వంబగు.

ఉదా:—చేయు + మునుపు = చేయకమునుపు.

(మునుపు, ముందు, మున్ను, తొల్లి, పూర్వము, మొదలగునవి పురార్థకములు.)

## అవ్యయములు

౯౧. లింగ వచన విభక్తి శూన్యము లవ్యయములు. (నామవాచకములకువలె లింగవచనవిభక్తులుండవు. సమాపక క్రియలకువలెఁ గాలపురుషవచనము లుండవు. విశేషణముల వలె నామవాచకాదుల గుణములను దెలుపవు.)

ఉదా:—ఓహో, బళా, కొట్టక మొదలైనవి.

లాక్షణికములని ప్రతిపదోక్తములని అవ్యయములు రెండు విధములు.

౯౨. లాక్షణికములు లక్షణముచే (వ్యాకరణముచే) సాధింపఁదగినవి. ఇవి యాఱువిధములు.

(౧) క్త్వార్థకము. ఉదా:—చేసి, పోయి, వచ్చి మొ॥

(౨) వ్య. క్త్వార్థకము. ఉదా:—చేయక, కొట్టక.

(3) తుమున్నాద్యర్థకము. ఉదా:— చేయన్, కొట్టఁగన్ మొ.

(౪) శత్రర్థకము. ఉదా:-చేయుచున్, కొట్టుచున్ మొ॥

(౫) చేదర్థకము. ఉదా:—చేసినన్, కొట్టినన్, మొ॥

(౬) ఆనంతర్యార్థకము. ఉదా:—చేయుడున్.

౯3. ప్రతిపదోక్తములు స్వతస్సిద్ధములై, పుట్టినవి పుట్టినట్లే యుండునవి.

ఉదా:—అకటా, ఔరా, అయ్యారే, బళిరే, మజ్జారే, కట్టా, ఓహో మొదలైనవి.

సముచ్చయములు

౯౪. పదముల నొకదానితో నొకటి కలుపు ప్రత్యయములు సముచ్చయములు.

ఉదా:—యు, ను, (ఇవి ద్రుతాంతములు.)

(అ) ఉకారాంతముల మీఁద "ను" వచ్చును.

ఉదా:—రాముఁడును, కృష్ణుఁడును వచ్చిరి.

(ఆ) ఉకారేతరముల మీఁద "యు" వచ్చును.

ఉదా:—హరియు, లక్ష్మియు వచ్చిరి.

శబ్దపల్లవములు

౯౫. ధాతువులు మొదలగువానికి వేఱుధాతువు లను ప్రయుక్తములై యర్థాంతరములను దెలుపును. వీనికి శబ్దపల్లవములని పేరు.

ఉదా:—కూరుచు + ఉండు = కూరుచుండు, మేలు + కొను = మేలుకొను- మేలుకాంచు- తలపోయు-విజయం చేయు - వేంచేయు - అరుదెంచు - అరుగుదెంచు - ఏతెంచు- ఏగుదెంచు - చనుదెంచు - నిలుచుండు - పరుండు- పన్నుండు ఆఁకొను - ఈకొను - ఈయకొను - ఇయ్యకొను - రకొట్టను- త్రెకొట్టను - మేకొను - మైకొను - అలవడు - ఏరుపడు - చొప్పడు - వెలువడు - తలపోయు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - కయిత్రవాలు - తూపొడుచు ఇత్యాదులు శబ్ద పల్లవములు.

---

## అధ్యాయము ౭

## కృత్తద్ధిత రూపములు

### కృదంతములు (Verbal Nouns) :—

౧. అర్థవిశేషసిద్ధికై ధాతువులను జేరునట్టియుఁ గ్రియా ప్రత్యయభిన్నములైనట్టియుఁ బ్రత్యయము లెల్లఁ గృత్తు లనం బడును.

౨. కృత్ప్రత్యయము లర్థ విశేషసిద్ధికై ధాతువులను జేరునపు డేర్పడు•రూపములు కృదంతము లనఁబడును.

3. కృదంతములు విశేష్యములై విభక్తిప్రత్యయము లను బొందుచుండును.

౪. "ఁత, కువ, క, ఇక, బడి, గడ" లోనగు కృత్ప్రత్యయములు ధాతువులకుఁ జేరునప్పు డాగమాదులగు పెక్కు-వికారములు కలుగుచుండును.

౭. ఎఱుఁగు మొదలగువానికి తుదను 'క' వర్ణక మగును.

ఉదా:—ఎఱుఁగు, ఎఱుక, తునుగు, తునుక, పోవు, పోక, కాగు, కాక, నడచు, నడక, మడఁచు, మడఁక, వీఁగు, వీఁక, మూఁగు, మూఁక, మలఁగు, మలఁక, కలఁగు, కలఁక, అలుగు, అలుక, మొలచు, మొలక, కినియు, కినుక.

౮. కృత్ప్రత్యయంబులు పరంబులగునపుడు కొన్ని ధాతువుల తుది యక్షరంబునకు లోపంబగు.

ఉదా:—అలుగు-అలుక, ఎఱుఁగు, ఎఱుక. మొ॥

౭. అణఁగు ప్రభృతులకుఁ "కువ" వర్ణకమగు.

ఉదా:—అణఁగు - అణఁకువ; అడఁగు - అడఁకువ పెనఁగు - పెనఁకువ; మెలఁగు - మెలఁకువ.

౮. కూరుచు ప్రభృతులకు "ఇమి" యగును.

ఉదా:—కూరుచు+ఇమి - కూరిమి; బలియు-బలిమి; నేరుచు-నేరిమి; ప్రేలుచు - ప్రేలిమి; ఒడ్డు - ఒడ్డిమి; తాలు-తాలిమి; బలియు - బలిమి.

౯. చేయు మొదలగువానికి 'ఁత' వర్ణకమగును.

ఉదా:—చేయు, చేఁత, మేయు, కోయు, గీయు, నేయు, పూయు, అలయు, కూయు, ప్రేయు, తీయు, వ్రాయు, ప్రోయు, మూయు మొదలైనవి.

౧౦. ఆడుప్రభృతులకు టవర్ణకమగును.

(ఆడు, ఊరు, తివురు, తేరు, త్రిమ్మరు, పండు, వండు, పాఱు, మండు, వేసరు, వనరు, చెమరు - ఇవి ఆడు ప్రభృతులు.)

ఉదా:—ఆడు, ఆట - ఊరు, ఊట.

౧౧. కూడు మొదలగువానికి "టము, టమి" వర్ణకములగును. ఉదా:—కూడు, కూటము, కూటమి;

ఓడు, ఓటము, ఓటమి.

౧౨. పడు మొదలగువానికి టువర్ణకమగు. అగుచో తొలి యచ్చువిూఁది వర్ణంబుల కెల్ల లోపంబును దొలియచ్చునకు దీర్ఘంబునగు. ఉదా:—పడు, పాటు, పొడుచు, పోటు.

(పడు, చెడు, అడుచు, పొడుచు, కఱచు, వయిచు, చేయు, ఓడు, వ్రేయు, మఱుఁగు, గీచు మొదలగునవి.)

౧౩. వలచు ప్రభృతులకు పువర్ణకమగు. అగుచో అంతిమాక్షర లోపంబగు.

ఉదా:—వలచు, వలఁపు, తలఁచు, తలఁపు, (పిలుచు విడుచు, తోఁచు, త్రేఁచు, విఱుగు, పెనుచు, పొలచు, పఁచు, ఏచు, కాచు, మేయు, అడుచు, అఱచు, మెచ్చు, వాచు, వంగు, చూచు, రాచు, దాయు, ఊడుచు మొదలైనవి.)

౧౪. ఆవులించు లోనగువానికి తవర్ణకమగును.

(ఆవులించు, సకిలించు, ఇగిలించు, ఓకరించు, ఓకిరించు, కుల్లగించు, పెకలించు, కొక్కరించు, వెక్కిరించు, కొప్పరించు, గిలిగించు, కౌఁగిలించు, పలుకరించు, కలువరించు, పలవించు మొదలైనవి.) ఉదా:—కవుగిలింత, ఆవులింత.

౧౫. అరయు మొదలగు వానికి ఇక వర్ణకమగును.

(అరయు, ఓపు, కూడు, ఓడు, అమరు, పొగడు, కలయు కోరు, పొందు, పోలు, ఏలు, తేలు, చేరు, నమ్ము, చల్లు, అల్లు, తేరు, బడలు, అలయు మొదలైనవి.)

ఉదా:—ఓపు, ఓపిక, అరయు, అరయిక.

౧౬. ఏలు ప్రభృతులకు బడి వర్ణకమగు.

(ఏలు, కొను, కను, కిట్టు, చెల్లు, చేరు, తగులు, తీరు, పెట్టు, మొక్కు, వచ్చు, సాగు, దిగు మొదలగునవి.)

ఉదా:—ఏలుబడి, కొనుబడి, తీరుబడి, కిట్టుబడి.

౧౭. పన్ను ప్రభృతులకు గడ ప్రత్యయమగు.

(పన్ను, మను, చేరు, తీరు, తేరు, ఏడు మొదలైనవి. తిరుగు, విఱుగు, ఆగు, వీని కంత్యాక్షరలోపమగును.)

ఉదా:—పన్నుగడ, మనుగడ, తీఱుగడ, తిరుగడ, ఆగడ, తేగడ.

౧౮. కొలుచు ప్రభృతులకు వువర్ణకమగును. అగుచో అంతిమాక్షర లోపంబగు.

(కొలుచు, పూచు, నోచు, నొచ్చు, చచ్చు, పుచ్చు, తడయు, నిలుచు మొదలైనవి.)

ఉదా:—కొలువు, నిలువు, నోవు, చావు.

౧౯. కుదురు ప్రభృతులకు వ వర్ణకమగును. అగుచో అంతిమాక్షర లోపంబగు.

(కుదురు, కొదరు, నిలుచు, లోచు, త్రోచు, నడచు మొదలైనవి.) ఉదా:—కుదువ, కొదవ, నిలువ.

౨౦. ఇమి వర్ణకంబు కలుగు లోనగు వానికగు. అగుచో నంతిమాక్షర లోపంబగు.

ఉదా:—కలుగు-కలిమి, నేరుచు-నేరిమి.

(కలుగు, నేరుచు, ఓరుచు, కూరుచు, వ్రేలుచు, బలియు, బ్రదుకు, ఒడ్డు. మొ॥ కలుగ్వాదులు.)

౨౧. ప వర్ణకంబు తిరియు లోనగువానికగు. అగుచో నంతిమాక్షర లోపంబగు.

ఉదా:—తిరియు-తిరిపము, వలియు-వలిపము, (కలియున కత్వంబునగు) కలియు - కలపము, (తిరియు, కలియు, పొలము, వలియు, మురియు, సొలయు మొదలగునవి.)

౨౨. ఇకి వర్ణకము కోరు మొదలగు వానికగు.

ఉదా:—కోరికి, పోలికి, పూనికి, మనికి, వినికి. (చూచునకు చూడికి.)

౨౩. అవర్ణకంబు గీఱు లోనగువానికగు.

ఉదా:—గీఱు - గీఱ; ఎండు - ఎండ, (గీఱు, ఎండు, ఉండు, కాయు, చదియు, తునియు, పరియు, పాయు, పిసుచు, మీటు, ముడియు, వదరు, వ్రయ్యు మొ॥ గీర్వాదులు.)

౨౪. అక వర్ణకము మాఱులోనగు వానికగు.

ఉదా:—మాఱకము, అమ్మకము.

(మాఱు, తమ్ము, అంపు, అద్దు, పంపు, వండు, పెంచు మొ॥ మాఱ్వాదులు. వండు డకారంబునకు ట కారంబగు - వంటకము. పెంచునకు పత్వము - పెంపకము.)

౨౫. డు వర్ణకంబు ఆఱు లోనగువాని కగు. అగుచో "చ, య" లకు పత్వంబగు.

ఉదా:—ఆఱు - ఆఱుడు; దాచు - దాపు; మాయు - మాపుడు.

(ఆఱు, అమ్ము, అల్లు, క్రుమ్ము, ఎక్కు, త్రొక్కు, త్రోచు, చోపు, దంచు, దాచు, దిగు, దోచు, పెంచు, వేచు, ప్రాకు, మాయు, రాచు మొ॥)

౨౬. వడి వర్ణకంబు కొలుచు లోనగు వానికగు.

ఉదా:—కొలువడి, గెలువడి, నడవడి, లేవడి.

౨౭. ఉ వర్ణకంబు అడుగు లోనగువానికగు.

అడుకు, అంటు, ఒప్పు, ఒఱుగు, ఒసగు మొ॥

౨౮. నగు లోనగువానికి "అవు" వర్ణకంబగు.

ఉదా:—నగవు, తగవు, ఉఱవు. మొ॥

౨౯. ఇ వర్ణకము చేయు వ్రాయులకగు.

ఉదా:—చేయు + ఇ = చేయి, వ్రాయు + ఇ = వ్రాయి.

3౦. కలి వర్ణకంబు కను వినుల కగు.

ఉదా:—కనుకలి - వినుకలి

## తద్ధితములు (Nominal Derivatives):—

౧. విశేష్యములకును, గొన్ని విశేషణములకును తాద్వర్థ్య, స్వార్థ, మాన, దఘ్న, మతుబాద్యర్థంబుల విధింపఁబడు ప్రత్యయములకు తద్ధితములని పేరు.

## త్వార్థకము

౨. తన వర్ణకము త్వార్థంబునందగు.

త్వార్థము = భావార్థము.

ఉదా:—రామునితనము (విశేష్యమునకు)

పెద్దతనము (విశేషణమునకు)

3. టిక వర్ణకంబు చిన్నాదులకగు.

ఉదా:—చిన్న + టికము = చిన్నటికము.

(చిన్న, పెద్ద, కన్నె, దొంగ, పేద, ముండ, లంజె, రాచ, చుట్టము మొదలగునవి చిన్నాదులు.)

౪. టికవర్ణకంబుపరంబగునపుడు ఉత్వంబునకత్వంబగు.

ఉదా:—వెజ్జు + టికము= వెజ్జటికము, తొత్తటికము, వెడ్డటికము.

౫. ఇమి వర్ణకంబు పేర్వాది శబ్దంబులకగు.

ఉదా:—పేరు + ఇమి = పేరిమి.

(పేరు, ప్రుచ్చు, మేలు, కడు, చెలి, వాఁడి, వేఁడి, పోఁడి మొ॥ పేర్వాదులు.)

౬. న వర్ణకము నల్లాదులగు గుణవచనంబులకగు.

ఉదా:—నల్ల + న = నల్లన.

(నల్ల, తెల్ల, ఎఱ్ఱ, పచ్చ, చామ, కమ్మ, పుల్ల, తియ్య, చప్ప, తిన్న, విన్న, ఒయ్య, అల్ల, చకచ, తిమ్మ, వ్రేఁక, మొ॥ నల్లాదులు.)

౭. ఇక వర్ణకంబు అగ్గలాదులకగు.

ఉదా:—అగ్గల+ఇక=అగ్గలిక; ఒమ్ము +ఇక=ఒమ్మిక.

## స్వార్థకము

౮. ఇకవర్ణకము నడవడి లోనగువానికి స్వార్థంబున నగు. (తద్ధితప్రత్యయములు చేరినను శబ్దార్థము మాఱకుండుట స్వార్థమనంబడును.)

ఉదా:—నడవడి + ఇక = నడవడిక.

మూన + ఇక = మూనిక.

(నడవడి, మూన, అరమర, ఆము, అల్లిబిల్లి, గండి, వాలు, మెలి, పొత్తి, నివ్వాళి మొ॥)

౯. ఉక వర్ణకంబు నెలఁతాదులకు స్వార్థంబునందగు.

ఉదా:—నెలఁత + ఉక = నెలఁతుక.

నాతి + ఉక = నాతుక.

(నెలఁత, నాతి, చిఱుత, మొలఁత, పడఁతి, మడఁతి, వెలఁది, నిప్పు, ఎమ్మె మొద॥)

౧౦. ఇత వర్ణకంబు పోరు లోనగు వానికి స్వార్థంబునందగు. ఉదా:—పోరు-పోరితము, ఇంపు-ఇంపితము.

౧౧. కారవర్ణకము నుడి లోనగువానికి స్వార్థంబునందగు.

ఉదా:—నుడికారము, కొల + కారము=కొలగారము (ఇచట క కారమునకు గ కారము.)

౧౨. ఇడి వర్ణకంబు వినికి ప్రభృతులకు స్వార్థంబునందగు. ఉదా:—వినికిడి, రాపిడి, తెలివిడి.

౧౩. ఇద వర్ణకంబు ఒప్పు ప్రభృతులకు స్వార్థంబు నందగు.

ఉదా:—ఒప్పిదము, తప్పిదము, బెట్టిదము మొ॥

## మానార్థకము

(కొలత, తూకము, మొదలగు వానిని దెలుపునది మానార్థకము)

౧౪. ఎడువర్ణకం బేకత్వంబున మానార్థంబునందగు.

ఉదా:—జేనెడు, మానెడు, పీసెడు, నిలివెడు, పట్టెడు, ముంతెడు, చేరెడు, గంపెడు, మూరెడు.

౧౫. ఎడువర్ణకంబు పరంబగుచో లి వర్ణంబునకు లోపంబగు. ఉదా:—దోసిలి + ఎడు = దోసెడు, పిడికెడు, పుడిసెడు, కమికెడు, సందెడు మొ॥

## దఘ్నార్థకము

(లోతును దెలియఁజేయునది దఘ్నార్థకము)

౧౬. బంటి కోలఁదులు దఘ్నార్థమునందగు.

ఉదా:—మొలబంటి - మొలకోలఁది; అడుగుబంటి-అడుగుకోలఁది - మొ॥

౧౭. బంటికోలఁదులు కొన్ని తత్సమంబులకుం జూపట్టెడి, ఉదా:—కటిబంటి, కటికోలఁది, శక్తికోలఁది మొ॥

## మతుబర్థకము

౧౮. కాఁ వర్ణకంబు పురుషవాచకం బగునపుడును, కత్తియ వర్ణకంబు స్త్రీవాచకంబగునపుడును, మతుబర్థంబు

నందు ఆ టా దులకగు. (కలవాఁడు, కలది యను నర్థమిచ్చు నది మతుబర్థకము)

ఉదా:—ఆటకాఁడు, ఆటకత్తియ, చెలికాఁడు, చెలికత్తియ.

(ఆట, అడపము, ఎమ్మె, ఓయారము, కటారి, కొల్ల, చెలిమి, చేరువ, చోరవ, జట్టి, జూదము, తిండి, తేర, దొడ్డ నీటు, నేస్తము, బేరము, పగ, విలు, వెచ్చము, సొగసు మొ॥ ఆటాదులు)

౧౯. కాకత్తియల కకారంబు కొండొకచో గకారంబగు. ఉదా:— అందగాఁడు, అందగత్తె, కొండెగాఁడు, కొండెగత్తియ, బేరగాఁడు, బేరగత్తియ.

౨౦. కాకత్తియలు కొన్నితావుల స్వార్థంబునందునుఁ జూపట్టెడి. ఉదా:—చెలికాఁడు, చెలికత్తియ.

౨౧. కా వర్ణకంబు కొన్ని తిర్యక్కులకుఁ జూపట్టెడు.

ఉదా:—ఇబ్బందిగాఁడు, ఒంటిగాఁడు, కొమ్ముకాఁడు, పరికాఁడు మొ॥ మృగవిశేష వాచకములు.

౨౨ "ఈ" వర్ణకంబు పురుషవాచకమై మతుబర్థంబునందటమటాదుల కగు.

ఉదా:—అటమటీఁడు, కొండీఁడు, మన్నీఁడు, (అటమటము, కొండెము, కమ్మతము, కన్నడము, బానసము, బూటకము, మందడి, మన్నెము, సుంకము, ఉక్కివము. ఉక్కివంబునకు వ లోపంబునగు. ఉక్కీఁడు, ఇత్యాదులు.)

౨౩. "ఈ" ప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునం జూపట్టెడు. ఉదా:—మొక్కలీఁడు, కల్లరీఁడు.

౨౪. అరివర్ణకంబు జూదాదులకు మతుబర్థంబునందగు.

ఉదా:—జూదము + అరి = జూదరి, జూదము, తగవు, కల్ల, చదువు, ఒఱపు, జాల, తీరుపు, తెంపు, తెరువు, నేరుపు, వెరవు, మతకము, సిగ్గు, సుంకము వేట మొ॥)

౨౫. ఇ వర్ణకంబు బేహారాదులకు మతుమర్థంబు నందగు.

ఉదా:—బేహారము - బేహారి, (బేహారము, బిత్తరము, చాగము, జోగము, తమకము, ఓయారము, తుటారము, బండారము, మచ్చరము, బిటారము, మిటారము, విన్నాణము, వెక్కసము, అక్కసి, కడలు మొ॥)

౨౬. త వర్ణకంబు స్త్రీ వాచ్యంబగునపుడు కులవాచకంబునకగు.

ఉదా:—చాకిత, బోయత, సాలెత, వేరిత, కోమటిత, వానెత మొ॥ (త వర్ణకంబు పరంబగునపుడు కొన్ని తావుల నెత్వంబు చూపట్టెడు) చెంచు+త= చెంచెత, మాలెత.

౨౭. ఆడివర్ణకంబు స్త్రీ వాచ్యంబగుచో బహువచనాంతంబులగు వగాదులకు మతుబర్థంబునం దగు.

ఉదా:—వగలు + ఆడి = వగలాడి; వన్నెలాడి, చిన్నెలాడి, కులుకులాడి, ఎమ్మెలాడి మొ॥

౨౮. ఆ వర్ణకంబు పుంస్త్వంబున బహువచనాంతంబులగు, వగాదులకు మతుబర్థంబునందగు.

ఉదా:—వగలాఁడు, వన్నెలాఁడు, చిన్నెలాఁడు, కులుకులాఁడు, ఎమ్మెలాఁడు మొ॥

౨౯. ఇడి వర్ణకంబు ముక్కులోనగు వానికి వాని లేమిని దెలుపుచు మతుమర్థంబునందగు.

ఉదా:—ముక్కిడి (ముక్కులేని వాఁడు) వెరవిడి, సిగ్గిడి, వాలిడి మొ॥

౩౦. మారి, పోతు వర్ణకంబులు తాచ్ఛీల్యంబుననగు.

ఉదా:—వగలమారి, మాయలమారి, మంటమారి, తిండిపోతు మొ॥

౩౧. మఱికొన్ని ప్రత్యయము లాయా యర్థంబులందు మహత్ప్రయోగములం జూపఁబడె.

ఉదా:—అడప (తాంబూల కరండవాహి; మతుమర్థంబున "అ" ప్రత్యయము) పెండ్లము (భార్య, మతుబర్థమున దము ప్రత్యయము). మగటిమి, పేదటిమి, కోటరము, కోడంట్రము, కోడంట్రికము, కోడరికము, కోమలికము, చెలికారము, తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు (ఱికాదులు రానిపక్షమున "తన" ప్రత్యయ మన్నింటికినగు. చిన్నతనము, ప్రముచ్చుఁదనము, నల్లఁదనము, ఒజ్జతనము, మొదలైనవి.)

## కొన్ని ఆచ్ఛిక విశేషములు

(ఆచ్ఛికములనఁ దత్సమములు కాని యాంధ్రపదములు)

౧. ఏకాదులుతప్ప తెనుఁగుపదములు స్త్రీ నపుంసక సమములగును.

(ఒకఁడు, వాఁడు, వీఁడు, ఎవఁడు, పాఱుఁడు, మగఁడు, చందురుఁడు, జముఁడు, మొదలైన పదములు ఏకాదులు)

ఉదా:—ఒల్ల, పిల్ల, గోరు, పేరు, పేను, బావి, పేఁడి మొ॥

౨. పుంలింగములగు మగాదులకును, కాఁప్రత్యయాంతంబులకును, గయిరాదులకును, "ఁడు" వర్ణకమగును. కాని ఉకారము మాత్రము రాదు.

మగ, మనుమ, రాయ, పాప, బాఁప, వే్ర, ఈ, కా, జే మొదలైనవి మగాదులు. కయిర, కత్తళ, జన్న, నీల, కడవ, పులియ, కోట, బసవ మొదలైనవి కయిరాదులు.

ఉదా:—మగఁడు, కయిరఁడు, చెలికాఁడు.

3. నెట్టనాదులు స్త్రీ నపుంసక లింగసమములు.

ఉదా:—నెట్టన, నెట్టనము; అక్కటిక, అక్కటికము; అటమట, అటమటము.

౪. అకర్వాదుల వు వర్ణము వైకల్పికముగ లోపించును.

ఉదా:— అకరువు, అకరు, అత్తరువు, అత్తరు, పుట్టువు, పుట్టు.

౫. ఇ య కు మారుగా నామాంతమునకు ఎత్వము బహుళముగ నగును.

ఉదా:—జన్నియ జన్నె, కన్నియ కన్నె, కొండి యము కొండెము.

౬. అపదాద్యంబై, అసంయుక్తంబయిన గకారము నకు వకారము విభాషనగును.

ఉదా:— వేసఁగి, వేసవి; తగులు, తవులు; పగలు, పవలు; అగు, అవు.

౭. ఊయెలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు ద్విర్వచనంబు విభాషనగు - అగుచోఁ దొలిదీర్ఘంబునకు హ్రస్వంబగు.

ఉదా:—ఊయేల-ఉయ్యేల, ఊయెల, ఉయ్యెల.

౮. అకారముక్రింది ఱకారమునకును తుది ను లు ల క్రింది న ల ల కును లోపము బహుళముగ నగును.

ఉదా:—అఱ్ఱు- అఱు- కఱ్ఱ- కఱ- గొఱ్ఱియ- గొఱియ కన్ను-కను-దున్ను-దును-పల్లు-పలు-విల్లు-విలు-నన్ను-నను.

౯. అక్కటాదుల జడ్డకు లోపము విభాషనగును.

ఉదా:—అక్కట - అట్టిక - అట్టు - అట్టె - అయ్యా - అయ్యారే - అవ్వారి - ఇట్టిక - ఉప్పడము - ఉమ్మ - ఎక్కసక్కెయము - ఎక్కరింత - ఎడ్డ - ఎన్నిక - ఎమ్మెక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పు - కమ్మటము - కమ్మతము - కువ్వాడము - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గిజ్జిగాఁడు - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట- చెన్నటి - చెప్పుము - చెప్పఁడు - చెమ్మట - చెల్లి -

జవ్వాది - జాబిల్లి - తమ్మటము - తమ్ములము - తల్లి - తువ్వర - తెల్ల - దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టేలు - పెగ్గడ - బొమ్మ - మత్తాబు - మల్లారము - ముద్దియ - లొట్టిపిట్ట - వయ్యాళి - సివ్వంగి - అట్టు - ఇట్టు - మమ్ము - మిమ్ము - అన్న - అవ్వ - అచ్చటు మొదలైనవి.

౧౦. జడ్డకకారముతోఁ బదాది స్వరంబుగూడుచోఁ జడ్డకు లోపము లేదు.

ఉదా:—అట్టు + ఎత్తె = అట్టెత్తె - కన్నదరె.

౧౧. హాదులు నీలుగు లోనగు వాని తొలి హల్లునకు లోపము బహుళంబుగ నగును.

ఉదా:—హాడపము - అడపము - హరిదళము - అరిదళము - నీలుగు - ఈలుగు - నెగయు - ఎడము - పొందు - ఒందు - పొనరు - ఒనరు - పూను - ఊను - పొదవు - ఒదవు - పంపు - అంపు.

౧౨. ఆరాటాదుల ప్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వము విభాషనగు.

ఉదా:— ఆలాటము - ఆరటము - కకూకరితి - కకుకరితి - కేళాకూళి - కేళకూళి - కేళాకుళి - కేళకుళి కౌమారుఁడు - కౌమరుఁడు - గంబూరము - గంబురము - పెండేరము - పెండెరము - బంగారము - బంగరము - బేహారము - బేహరము మొదలగునవి.

౧౩. ఓయారాదులఁ దొలిదీర్ఘమునకు హ్రస్వము విభాషనగును.

ఉదా:—ఓయారము - ఒయారము - కేళాకూళి - కెళాకుళి - గోరువంక - గొరువంక - పేడ - పెడ - బేహారము - బెహారము మొదలైనవి.

౧౪. అడంగ్వాదుల డాకు ణ కారము విభాషనగును.

ఉదా:—అడఁగు - అణఁగు - కడఁగు - కణఁగు - నాడెము - నాణెము - పోడి - పోణి - మిడుఁగు - మిణుఁగు - వడఁకు - వణకు - మిడుఁగురు - మిణుఁగురు.

౧౫. దక్కులోనగువాని దకారమునకు డకారము విభాషనగును.

ఉదా:—దక్కు - డక్కు - దగ్గఱు - డగ్గఱు - దెప్పరము - డెప్పరము - దొంగ - డొంగ - దెందము - డెందము - దబ్బఱ - డబ్బర - దాయు - డాయు - దప్పి - డప్పి - దాపల - డాపల.

౧౬. ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘము విభాషనగును.

ఉదా:—ఏతము - ఏతాము - కళ్ళము - కళ్ళాము - గాలము - గాలాము.

౧౭. పదాంతంబులయి యసంయుక్తంబులయిన, ను, లు, రు, ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు.

(ఇందు న ర ల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు)

ఉదా:—వ్రాను + పడె - వ్రాన్పడె - వ్రానుపడె. వత్తురు + వారు- వత్తుర్వారు- వత్తురువారు. సేనల్ - సేనలు.

౧౮. ఆచ్ఛికంబుల పదమధ్యంబుల న ల డ ర ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు.

ఉదా :—కినుక - కిన్క--చిలుక-చిల్క - అడుగు-అడ్గు కూరుకు - కూర్కు

౧౯. లాఁతియచ్చునకు సహితమొకచోట నడినడుమ లోపంబు గానంబడియెడి.

ఉదా:—కలికి - కల్కి; ములికి - ముల్కి.

౨౦. అబ్బురాదులందుత్వంబునకు లోపంబు విభాషనగు. ఉదా:—అబ్బురము - అబ్రము - నెత్తురు - నెత్రు.

౨౧. చుక్కపరక రువర్ణంబునకు ముందటి దువర్ణంబునుత్వంబునకు లోపంబు విభాషనగు. అగుచోఁ దత్పూర్వస్వరంబు గురువుగాదు. ఉదా:—అదురుచు - అద్రుచు.

౨౨. జూదాదుల దకారమునకు జకారము విభాషనగును.

ఉదా:—జూదము - జూజము. జవ్వాది - జవ్వాజి. విరవాది - విరవాజి.

---

# అధ్యాయము ౮

## వాక్యప్రకరణము

### కర్త - కర్మ - క్రియలు

౧. (అ) కర్త:—(Agent or Subject) క్రియకు ఆశ్రయమగు పనినిచేయువాఁడు, లేక చేయునది.

ఉదా:—రాముఁడు నడచెను.

(ఆ) కర్మ:— (Object) క్రియయొక్క ఫలమును పొందునది. ఉదా:—రాముఁడు లంకను జయించెను.

(ఇ) క్రియ:— (Verb) జరుగుపని.

ఉదా:— రాముఁడు పరువెత్తెను.

౨. (అ) క్రియను దెలిసికొని ఎవఁడు ఏది యని ప్రశ్నవేయఁగా కర్తవచ్చును.

(ఆ) క్రియను దేనిని, వేనిని అని ప్రశ్నవేయఁగా కర్మవచ్చును.

### ప్రయోగములు

3. వాక్యప్రయోగము:— కర్త్రర్థక ప్రయోగము లేక కర్తరిప్రయోగము. కర్మార్థక ప్రయోగము లేక కర్మణి ప్రయోగము అని రెండు విధములు.

౪. (అ) కర్త్రర్థక ప్రయోగము (Active voice) కర్త ప్రథమావిభక్తిగను, కర్మద్వితీయావిభక్తిగను నుండును. (క్రియచేఁ గర్త చెప్పఁబడునది.)

ఉదా:—రాముఁడు రావణునిఁ జంపెను.

౧౪. అవ్యయమునకు:—

౧. ఏభాషాభాగము. ౨. తత్సమమా? అచ్చికమా? ౩. ఏయంతర్భాగము? ౪. సముచ్చయమైన వేనిని గలుపును? ఉదా:—ఆ చిన్న రాముఁడు నీతో మంచిమాటలను బలికెను.

## రూ ప ని ష్ప త్తి

## అన్వయక్రమము - Parsing

౧౫. అన్వయము:- ఆయాభాషాభాగములు వేనితో సంబంధించినవో వివరించుట.

౧౬. యొక్క తప్ప తక్కిన విభక్తులు క్రియతో నన్వయించును. ఉదా:—నీవు నాతోఁ జెప్పితివి.

౧౭. యొక్క యనునది పిమ్మటి విశేష్యముతో నన్వయించి క్రియను జెందును.

ఉదా:—కృష్ణునియొక్క కృపను గాంచితిని.

౧౮. విశేషణములు విశేష్యములతోడను, సర్వనామములతోడను అన్వయించును.

ఉదా:—తెల్లని గుఱ్ఱము, యోగ్యుఁడగు రాతు.

౧౯. సర్వనామములు క్రియతో నన్వయించును.

ఉదా:—వాఁడు దానిని జూచెను.

౨౦. అవ్యయము క్రియతో నన్వయించును.

ఉదా:—చూచి చనెను.

౨౧. క్రియలు కర్తతో అన్వయించును.

ఉదా:—చూచెను కృష్ణుఁడు.

అన్వయక్రమమున కుదాహరణము:—

ఒక విద్యార్థి పాఠశాలకుఁ జని అచ్చటి పాఠములను మిగుల శ్రద్ధతో నేర్చెను.

ఒక:—సంఖ్యావాచక విశేషణము, విద్యార్థి యను విశేష్యముతో నన్వయము.

విద్యార్థి:—పుంలింగము, మహదర్థకము, ఏకవచనము, ప్రథమావిభక్తి, కళ, నేర్చెను అను క్రియకుఁ గర్త.

పాఠశాలకున్:—విశేష్యము, అమహదర్థకము, ఏకవచనము, షష్ఠీవిభక్తి, దు్రితప్రకృతికము, చని యను నసమాపక క్రియతో నన్వయము.

చని:—చనుధాతువు, అసమాపకము, భూతకాలము, సకర్మకము నేర్చెను అను సమాపకముతో నన్వయము.

అచ్చటి:—అవ్యయము, విశేషణరూపము నొంది పాఠములు అను నామవాచకముతో నన్వయించుచున్నది.

పాఠములను:-విశేష్యము, అమహదర్థకము, బహువచనము, ద్వితీయావిభక్తి, దు్రితప్రకృతికము, నేర్చెను అను క్రియకు కర్మ.

శ్రద్ధతోన్:—నామవాచకము, అమహదర్థకము, ఏకవచనము, తృతీయావిభక్తి, దు్రితప్రకృతికము, నేర్చెను అను క్రియతో నన్వయము.

నేర్చెను:—నేర్చు ధాతువు, ప్రథమపురుష, ఏకవచనము, భూతకాలము, సకర్మకము, విద్యార్థి యను కర్తతో నన్వయించును.

# అధ్యాయము ౯

## వ్యాసరచనా విధానము

## (Errors in Grammar and Syntax)

౧. వ్యాసరచనమునందు వస్తువర్ణనము, ౨. భాష, 3. రచన, ర. గుణము, ౫. గుఱుతులు:—

౧. వస్తువర్ణనము:-వ్యాసము వ్రాయువలయు వస్తువును గుఱించిన విషయముల నాలోచించి విషయమును బట్టి (పేరాలు) పరిచ్ఛేదములు విభజించుకొననగు. ప్రతి పరిచ్ఛేదమునకు సన్నిహిత సంబంధమును ప్రతివాక్యమునకును నటులే సంబంధమును గమనింపనగును.

౧. వస్తువుయొక్క స్వరూపము, స్వభావము, మొ॥
౨. జన్మము, వాసస్థానాది విశేషములు.
3. అభివృద్ధిఁజెందు మార్గములు.
ర. ప్రాణముగలదైన నాహారాదులు.
౫. దానివలననైన లాభనష్టములు.
౬. ఇతర విశేషములు.

౨. భాష:—వ్యాకరణ విరుద్ధమైన శబ్దముల నుప యోగింపక సులభశైలిలో సరళాదేశాది సంధులు, అర సున్నలు, బండిఱాలు మొదలగువానిని బాటింపనగును.

(అరసున్నలు వేయమఱచినను దప్పులేదుగాని లేని చోట వేయుట గొప్ప తప్పు. అట్లే రేఫ (ర) కు మాఱు ఱ వర్ణము వ్రాయుటయు, సంధి చేయఁగూడని చోటఁ

జేయుటయు, కళలను దుత్రిత పరికృతికములుగ, దుత్రిత ప్రకృతి కములను కళలుగ వ్రాయుట దోషమే; వ్రాయు విషయము ముగియఁగనే యొకమాఱు చదువఁదగు. కానిచో సవరించు కొనఁదగు దోషములే మిగిలిపోవును.

3. రచన:— నేటికాలపు విద్యార్థు లింగ్లీషువాక్య ములు కల్పించుపద్ధతి నాంధ్రమునగూడ నుపయోగించు చుందురు. తెలుగు పద్ధతుల ననుసరించి వాక్యములు కల్పింపఁ దగును.

౪. పరిచ్ఛేదము (పేరా):— మొదలు పెట్టునపుడు కొంతవదలి పంక్తిఁ బ్రారంభింపవలయును. పంక్తులు సూటి గను దస్తూరి నీటుగను నుండవలయును.

వ్యాసరచనయం దుపయోగింపనగు గుఱుతులు.

(అ) పూర్ణవిరామము, లేక తిలకము (Fullstop or Period). వాక్యముయొక్క చివర నుంచనగును.

ఉదా:— బాలుడు పాఠము చదివెను.

(ఆ) అపూర్ణ విరామము (Colon) :

(ఇ) అర్థవిరామము లేక శేషచిహ్నము (Semi-colon) ;
అర్థము పూర్తిగాని వాక్యక్రియకు పైనివేయనగును

ఉదా:— వాఁడు పరధ్యానముతో వ్రాయుచున్నాఁడు; కాన తప్పుబడినది.

(ఈ) అల్పవిరామము లేక విశ్రాంతి చిహ్నము (Coma) , అర్థమునుబట్టి నిలుపఁదగు చోటుల నుంచనగును.

ఉదా:—రాముఁ డరణ్యమునకుఁ బోఁగా, భరతుఁడు రాజ్యమేలెను.

(ఉ) ప్రశ్నార్థకము (Note of interrogation) ? ప్రశ్నచేయు చోటుల నుంచనగును.

ఉదా:—అందఱును క్షేమమా ?

(ఊ) రాగచిహ్నము (Note of exclamation) ! ఆశ్చర్యము, దుఃఖము, కోపము, స్ఫురింపఁజేయు చోటుల నుంచనగును.

ఉదా:-దేవుని యీ ప్రపంచగృహమున సూర్యచంద్రులు దీపములవలె నున్నారుగదా !

(ఋ) ప్రమాణ (ఉద్ధరణ) చిహ్నము (Sign of Quotation) " " సందర్భమునుబట్టి తీసికొనిన లోకోక్తి మున్నగు వాని కీవలావల వేయనగును.

ఉదా:—ధర్మము జయప్రదమైనది. "యతోధర్మస్తతో జయ" అని వినలేదా ?

(ౠ) అవరణములు లేక త్యాజ్యచిహ్నము. (Brackets) ( ) వాక్యములో చేరనట్టియు, స్పష్టతకై చూపఁబడునట్టియు భాగములకు వాడనగును.

ఉదా:—రాముఁడు (దశరథుని కొడుకు) పితృవాక్య పరిపాలన మొనర్చెను.

(౫) లోపచిహ్నము (Dash)—

విడువఁబడిన భాగమును దెల్పుటకు వాడనగును.

ఉదా:—రాముఁడు—చనియెను.

(౬) హంసపాదము. ×

విడువఁబడిన అక్షరములను, మాటలను, పంక్తిపైన వ్రాయునపుడు క్రిందను వాడనగును.

లంకకుఁ

ఉదా:—రాముఁడు సముద్రమునుదాటి × జేరెను.

(౭) సామ్యచిహ్నము = సమానత్వమునందు వాడనగును.

(౮) తారకము:—(Star) *

విశేషాంశములను దెలుపవలసి వచ్చునప్పు డీగుర్తు నుపయోగించి పుటక్రింద విషయము వివరించుటకు వాడనగును.

---

## అధ్యాయము ౧౦

## దోషవివరణము

ఆద్యక్షర దోషములు:—

౧. యకారంబును ఉ. ఊ. ఒ. ఓ లఁ గూడిన వకారంబును ణ ళ అనునక్షరంబులును దెలుఁగుపదముల మొదట నుండవు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఇతఁడు | యితఁడు |
| ఒకటి | వొకటి |
| ఏల | యేల |
| ఓడ | వోడ |
| నలుసు | నళుసు |
| లక్క | ళక్క |

౨. ద్రుతప్రకృతికములమీఁద యడాగమదోషములు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| వచ్చెనతఁడు | వచ్చెయతఁడు |
| చూచెనతఁడు | చూచెయతఁడు |
| అక్కడనుండెను | అక్కడయుండెను |
| ఇంటిలోనున్నారము | ఇంటిలోయున్నారము |
| వానివలె నున్నాఁడు | వానివలెయున్నాఁడు |

3. కళలపై నకారాగమ దోషములు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఏలయన | ఏలనన |
| లేకయే | లేకనే |
| నీకై యేడ్చెను | నీకై నేడ్చెను |

౪. ద్రుతప్రకృతికములను గళలుగ వాడుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చాలన్ | చాలా |
| ఇంకన్ | ఇంకా |
| కూడన్ | కూడా |

౫. కళలను ద్రుతప్రకృతికములుగ వాడుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| ఏల | ఏలన్ |
| రాక | రాకన్ |

౬. దుష్టహల్ సంయోగము.

| ఒప్పు | తప్పు |
|---|---|
| శరచ్చంద్రిక | శరశ్చంద్రిక |
| విద్యుచ్ఛక్తి | విద్యుశ్శక్తి |

౭. వ్యతిరేకార్థ మిచ్చునటుల ప్రార్థనార్థములవాడుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చేయుమనియె | చేయమనియె |
| వెళ్లుమనియె | వెళ్లమనియె |
| కొట్టుమనియె | కొట్టమనియె |

౮. ప్రార్థనార్థక మువర్ణమును లోపింపఁ జేయుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చూడుమిపుడు | చూడిపుడు |
| చదువుమింక | చదువింక |

౯. ఆత్మనే పదార్థమున కొనునకు కకారము.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చేసికొని | చేసుక - చేసుకొని |
| మోసికొని | మోసుక - మోసుకొని |
| రాచుకొని | రాసుక - రాసుకొని |

౧౦. ధాతువులోని యుకారమునకు సుకారము.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చేయుట | చేసుట |
| కోయుట | కోసుట |

౧౧. చు—పు—లలో నొకదాని కొకటివాడుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| రక్షింపక | రక్షించక |
| రక్షింపన్ | రక్షించన్ |
| రక్షింపఁగలను | రక్షించఁగలను |
| పచింపించు | పచించించు |

౧౨. క్త్వార్థకేకార సంధి.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చేసియడిగె | చేసడిగె |
| కొని యిచ్చెను | కొనిచ్చెను |

౧౩. ఉత్తమపురుష సంధిదోషము.

| ఒప్పు | తప్పు |
|---|---|
| చేసితినిపుడు | చేసితిపుడు |
| వచ్చితినిటకు | వచ్చితిటకు |

౧౪. వర్ణవ్యత్యాసములు శ. ష. సలు.

| ఒప్పు | తప్పు |
|---|---|
| శిరస్సు | సిరస్సు |
| శిష్యులు | శిశ్యులు |
| సీత | శీత |
| కష్టము | కస్టము |
| సైన్యము | శైన్యము |

౧౫. ఒత్తులున్నచోట వదలుట లేనిచోట నుంచుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| భేదము | బేధము |
| బాధ | భాద |
| మేఘము | మేఖము |
| కష్టము | కష్ఠము |

౧౬. ధ, థల నొకదాని కింకొకటి వాడుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| స్థానము | స్ధానము |
| ధనము | థనము |
| స్థిరము | స్ధిరము |

౧౭. లింగవచన విరోధములు.

సంస్కృత శబ్దములు తత్సమములై తెలుఁగులోనికి వచ్చినపుడు లింగవ్యత్యాసముచే రూపభేదమునందుచున్నవి. వీనిని శ్రద్ధతో గమనింపనగును.

| | |
|---|---|
| మిత్రుఁడు | మిత్రము |
| సముద్రుఁడు | సముద్రము |
| వానరుఁడు | వానరము |
| చరిత్రము, చరితము | చరిత్ర, చరిత |
| నాళికము | నాళిక |
| విధాత్రుఁడు | విధాత |

౧౮. మహతీతరంబులగు స్త్రీలింగంబుల విశేషణములు క్లీబసమములుగాఁగూడ నుండవచ్చును. (క్లీబము=నపుంసకము).

| | |
|---|---|
| మనోహరయగు లత | మనోహరమగు లత |
| హృద్యయగు విద్య | హృద్యమగు విద్య |

౧౯. పూజ్యతయం దేకవచనమునకు మాఱుగా బహువచనము వాడనగును.

గురుపులకు నాయెడ దయ. గురువునకు నాయెడదయ.

౨౦. షష్ఠీ తత్పురుషమునందుఁ గొండొక-చో నీనా శబ్దములకు మాఱు వాని బహువచనములే వాడఁబడు.

ఉదా :—మాయిల్లు, మీామేడ మొదలైనవి.

౨౧. విశేషణ విశేష్యవిరోధములు :—

విశేషణముల షష్ఠికిఁ బ్రథమయు నగు.

షరా:—సుగుణాభిరాముఁడు రామునకు జోహారు. సుగుణాభి రామునకు రామునకు జోహారు.

౨౨. ము ప్రత్యయాంతవిశేషణములును స్త్రీసమంబులగు విశేషణములును బహువచనమునందుండవలసినవి యేకవచనమునందు నుండనగు.

ఉదా:—ఇష్టమగు పదార్థములు - ఇష్టములగు పదార్థములు. మాటలు పెక్కేల? మాటల్కు పెక్కు-లేల?

౨౩. పునరుక్తి - ఉదా :— హిమాచలపర్వతము, తోవ మార్గము, వనము తోట.

౨౪. ఔపవిభక్తికములను సామాన్యముగ వ్రాయుట.

| ఒప్పు | తప్పు |
|---|---|
| నేతిని | నేయిని |
| గోతియందు | గోయియందు |
| ఊరిలో | ఊరులో |

---

## అధ్యాయము ౧౧

## కావ్యప్రకరణము

## ఛందస్సు (PROSODY)

రసాత్మకమైన వాక్యముగాని, వాక్యసమూహము గాని కావ్యమనఁబడును. ఇది ౧ పద్యకావ్యము, ౨ గద్య కావ్యము అని రెండు విధములు. గద్యమన వచనము; కథలు నవలలు మొదలగునవి గద్యకావ్యములు. పద్యకావ్యముల కంగభూతములగు పద్యముల లక్షణములను జెప్పునది ఛందస్సు అనఁబడును.

పద్యములు గణముల కూర్పుచే నేర్పడుచున్నవి. గురు లఘువర్ణములు మూఁడుకూడిన నొక గణమగును.

### గురువులు

౧. దీర్ఘాక్షరము - కా, రా, ఈ మొ॥

౨. పొల్లు హల్లులు చివరఁగలవి - కన్, రల్ మొ॥

౩. నిండుసున్న చివరఁగలవి - కం, రం, మొ॥

౪. విసర్గ చివరఁగలవి - రః, షః మొ॥

౫. ద్విత్వ సంయుక్తాక్షరము } ర క్ష, క మ్మ,
లకు ముందున్న అక్షరములు } అ య్య, మొ॥

పైఁజెప్పిన యైదువిధములగు వర్ణములు గురువులు.

౨. తక్కిన పొట్టివర్ణములు లఘువులు.

ఉదా:-అ. ఇ. ఉ. ఋ. ఌ. ఎ. ఒ. క. చ. య. మొ॥

లఘువునకు గుఱుతు । గురువునకు గురుతు U

గణము:—గురు లఘువులగు మూఁడేసి యక్షరములుకలది. ౧. మగణము ౨. భగణము ౩. జగణము ౪. సగణము ౫. నగణము ౬. యగణము ౭. రగణము ౮. తగణము.

| | | | |
|---|---|---|---|
| మూఁడు గురువులు | :—౧ మగణము | U U U | శ్రీరామా |
| ఆది గురువు, తక్కినవి లఘువులు | :-౨ భగణము | U । । | శ్రీహరి |
| మధ్యగురువు ,, | :-౩ జగణము | । U । | మురారి |
| అంత్యగురువు ,, | :-౪ సగణము | । । U | వరదా |
| మూఁడు లఘువులు | :-౫ నగణము | । । । | నృహరి |
| ఆది లఘువు, తక్కినవి గురువులు | :-౬ యగణము | । U U | మురారీ |
| మధ్య లఘువు ,, | :-౭ రగణము | U । U | శ్రీహరి |
| అంత్య లఘువు ,, | :-౮ తగణము | U U । | గోవింద |

సూత్రము:—శ్లో॥ ఆది మ, ధ్యావసానేషు ।
యా, ర, తా, యాంతి లాఘవం ।
భ, జ, సా, గౌరవంయాంతి ।
మ, నౌ, తు గురులాఘవౌ॥

౨. ఉపగణము:—గురు లఘువులగు రెండేసి యక్షరములు గలది.

౧. హ గణము (గలము); ౨. వ గణము (లగము)
గురువుపై లఘువు—హ గణము (గలము)— ‿ । శౌరి
లఘువుపై గురువు— వ గణము (లగము)— । ‿ హరీ

౧. మూఁడక్షరముల గణములపై లఘువున్నచో గణాక్షరములతో ల చేరును. గురువున్నచో గ చేరును.

ఉదా:—తగణముపై లఘువున్న తలము. సగణముపై గురువున్న సగము నగుఁబడును.

ఉపగణములలో (౧)సూర్యగణములు, (౨)ఇంద్రగణములు అని రెండు తెగలు ముఖ్యములు.

। । । ‿ ।

౧. సూర్యగణములు:— (౧) న గణము (౨) హ గణము (గలము) ఉదా:—నృహరి, శౌరి.

౨. ఇంద్రగణములు:—౧. నలము, ౨. నగము,
3. సలము, ౪. భగణము, ౫. రగణము, ౬. తగణము.
ఉదా:—౧ నలము—నగణముపై లఘువు । । । । నరసఖ
౨. నగము:—నగణముపై గురువు । । । ‿ నరసఖా

3. సగణము:-సగణముపైలఘువు । । ⌣ । గురునాథ
౪. భగణము:-౧గురువు తక్కినవి ౨ లఘువులు⌣ । । శ్రీహరి
౫. రగణము:-గురువును లఘువును గురువును⌣ । ⌣ శ్రీహరీ
౬. తగణము:-రెండుగురువులును పైలఘువు ⌣ ⌣ । గోవింద

యతి:—పద్యపాదముయొక్క మొదటివర్ణము. దీనికి విశ్రాంతి, విరతి, విశ్రమము, వళి మొదలగు పేర్లుగలవు. దీనికి స్వరము ప్రధానము. నిర్ణయమైన స్థానమున నాయక్షరముగాని లేదా దానికి మైత్రిగల వర్ణముగాని నిలుపనగును.

యతిమైత్రి:-౧. అచ్చులు:—అ, ఆ, ఐ, ఔ,

హల్లులపై స్వరమైత్రి:- ✓, ా, ై, ౌ
ఇ, ఈ, ఎ, ఏ, ఋ, ౠ ి ీ ె ే ృ ౄ
ఉ, ఊ, ఒ, ఓ, ు ూ ొ ో

౨. హల్లులు:—క, ఖ, గ, ఘ,
చ, చ, ఛ, జ, జ, ఝ, శ, ష, స
ట ఠ డ ఢ
త థ ద ధ
ప ఫ బ భ వ
పు ఫు బు భు ము
మ ంప ంఫ ంబ ంభ
న ణ

} క్ష యనువర్ణమీ రెండు తెగలవర్ణములకును జెల్లును

ర ఱ

ల ళ

ఌ అ య హ

పై తెగలలోని యక్షరము లే తెగ కా తెగలోఁ బర స్వరము యతిమైత్రిఁ జెందును.

యతిభేదములు

౧. స్వరయతి, ౨. వ్యంజనయతి, 3. ఉభయయతి, ౪. ప్రాసయతి.

౧. స్వరయతి:—

అ, ఆ, ఐ, ఔ, లకు

ఇ, ఈ, ఎ, ఏ, ఋ, ౠ లకు

ఉ; ఊ; ఒ; ఓ లకు యతి వానిలో వానికిఁ జెల్లును.

(కకారాది హల్లులతో స్వరమును సంధిఁజేసి, యా స్వరమునకుఁ దగిన స్వరమును యతి కుపయోగింపనగును.)

ఉదా:—ఇనతనూభవ మిత్ర లంకేశజైత్ర

(లంక + ఈశ) సంధిలోని ఈ తో యతి.

౨. వ్యంజనయతి:—ఇది ౧. ప్రాణయతి, ౨. వర్గయతి, 3. బిందుయతి, ౪. పోలికయతి, ౫. సరసయతి, ౬. అభేదయతి, ౭. సంయుక్తాక్షరయతి.

౧. వ్యంజనములకు స్వరమైత్రివలన యతి చెల్లును. ఇది ప్రాణియతియనఁబడు.

ఉదా:—కాళియోరగ వైరి కైటభారి.

౨. వర్గయతి ప్రతివర్గమందలి మొదటి నాల్గక్షరము లకుఁ బరస్పరము యతి చెల్లును.

ఉదా:—ఖంజనాభ దేహ గాన మోహ

3. బిందుయతి:—వర్గాక్షరములు సబిందుకంబులై తమ తమ అనునాశికములతో యతి చెల్లును.

ఉదా:—జ్ఞానవేద్యాయ తప్తకాఞ్చన విభూష

౪. పోలికయతి:—మ కారముతో పుఫు బుభు లకు యతిచెల్లును. ఉదా:—ఫుల్లపంకేరుహము వక్త్రముగనొనర్చె

౫. సరసయతి:—అయహాలలో చ, ఛ, ఛ, జ జ, ఝ, శ, ష, స, క్షులలో న, ణ లలోఁ బరస్పరము యతి చెల్లును. ఉదా:—హరిహయాది సురాధ్యక్ష అంబుజాక్ష

యతిజన మనోంబుజవిహార అఘ విదూర
నరకదైత్య విరోధి ఘృణాపయోధి
శకట దానవ సంహారి చక్రధారి
షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛాప్రవర్తి.

౬. అభేదయతి:—ప ఫ బ భ లకు వకారముతోడను, లకారమునకు ళ కారముతోడను యతి చెల్లును.

ఉదా:—వసుమతీకళత్ర బకదైత్ర గానక
ళాలసత్కలాప లలితదీప

౭. సంయుక్తాక్షరయతి:—సంయుక్తాక్షరంబులం దెద్ది యైన యతికిఁ దగును.

ఉదా:—క్ష్మాధరంబాతపత్రంబుగా ధరించె
క్ష్మాకుమారుని బోరిలో సంహరించె

౩. ఉభయయతి:—సమసించిన పదములు విడఁదీయ రానియట్లు కూడియున్న యప్పుడు స్వరవ్యంజనములు రెండును యతికి జెల్లును.

ఉదా:—పదార్థము - అనేకము - జనార్దనుఁడు
'నగినగి యేనియున్ వినుజనార్దన (హల్లుతో)
కా॥ యరుచి చిత్రాబ్జఖంజన జనార్దనా! (అచ్చుతో)

౪. ప్రాసయతి:—యతికి మాఱుగా ప్రాస మే కొండొకచో నుంచవచ్చును.

ఉదా:—బోఁటియొకటి పెండ్లిపాటపాడఁగ

## ప్రాస

పద్యపాదమందలి రెండవయక్షరము ప్రాసయనఁబడును.

౧. ప్రాసమేయచ్చుతోఁ గూడియున్నను బనికివచ్చును. కాని హల్లు మారరాదు. దీర్ఘాక్షరమైనను లేక హ్రస్వాక్షరమైనను లేక సంయుక్తాక్షరమైనను నట్లే తక్కిన పాదములయం దుండవలయును. తనకు పూర్వవర్ణమైన యతి సర్వత్ర గురువుగానైన, లఘువుగానైన నుండవలయును.

## ప ద్య ము లు

పద్యములు యతి ప్రాసములతోఁ గూడిన నాలుగు పాదములు గలిగినవి.

ఇవి ౧. వృత్తములు, ౨. జాతులు, ౩. ఉపజాతులని మూఁడు విధములు.

## ౧. వృత్తములు

వృత్తములు (మూఁడక్షరములుగల) నిసర్గ గణములతో నేర్పడునవి.

ఇవి ౧. ఉత్పలమాల, ౨. చంపకమాల, 3. శార్దూలము, ౪. మత్తేభము మొదలైనవి.

౧. ఉత్పలమాల:—ప్రతిపాదమునను భ, ర, న, భ, భ, ర, వ గణములును, పదియవ యక్షరము యతిస్థానమును గల్గిన నాలుగు పాదములు గలది.

ఉదా:— (లగము)

భ ర న భ భ ర వ

∪ I I, ∪ I ∪, I I I, ∪ I I, ∪ I I, ∪ I ∪, I ∪

కొండని, వేడ్క-తోఁ,బసిఁడి,కొండధ, నార్థుల, కెల్లఁబం, చియీ
కుండుటదాన్నధారకుఁ బయోనిధులెల్ల వ్యయింపలేమి యీ

౨. చంపకమాల:-ప్రతిపాదమును న, జ, భ, జ, జ, జ, ర గణములును, పదునొకండవ యక్షరము యతిస్థానమును గల్గిన నాలుగు పాదములు గలది.

ఉదా:—

న జ భ జ జ జ ర

I I I, I ∪ I, ∪ I I, I ∪ I, I ∪ I, I ∪ I, ∪ I ∪

చెలువ, మునెల్లఁ, బ్రోవుగ,నుజేసి,ప్రవీణ,తనంబు,జంబులన్
గలయ, గసృష్టి, జేసియ, నుకంప, జనింప, విరించి, మించితా

3. శార్దూలము ప్రతిపాదమునందును మ స జ స త త గ గణములును, పదమూఁడింట యతిస్థానమును గల్గిన నాల్గుపాదములు గలది. ఉదా:—

మ స జ స త త గ
UUU, | | U, |U|, | |U, UU|, UU|, U
శ్రీరామా, రఘునం, దనార, ఘుపతీ, సీతామ, నోనాయ, కా
మారాకా, రసమ, స్తలోక, నుతశుం, భద్దైత్య, నాశంక, రా

౪. మత్తేభము ప్రతిపాదమందును స భ ర న మ య (లగము) వగణములును, పదునాల్గవ యక్షరము యతిస్థానమును గల్గిన నాలుగు పాదములు గలది. ఉదా:—

స భ ర న మ య వ
| | U, U | |, U|U, | | |, UUU, |UU, |U
రజనీ, నాధకు, లైకభూ, షణుఁడ, వై రాజ, క్షివై ధా, రుణీ
ప్రజనెల్లన్ ప్రజవోలెధర్మనియతిన్ బాలింపుచున్ దోంటిధర్

౫. మత్తకోకిల:— ర స జ జ భ ర గణములు ప్రతిపాదమునఁగలిగి, ౧౧వయక్షరము నాల్గు పాదములందును యతిస్థానముగాఁ గలది.

ర స జ జ భ ర
U | U, | | U, | U |, | U |, U | | U | U
పుత్రియు, ట్లగున, మ్మశ్లోక, ముబొంది, కుందుచు, నున్నసీ

౬. మాలిని:— న న మ య య గ ణ ము లు ను తొమ్మిదవయక్షరము యతిస్థానమును ప్రతిపాదమునందు గల నాలుగుపాదములు గలది. ఉదా:—

న న మ య య

| | |, | | |, U U U, | U U, | U U

క లి త, శుభ చ, రిత్రాద్రా, వకన్యా, కళత్రా

౭. పంచచామరము:— జ ర జ ర జ గ అనుగణములు, పదియవ యక్షరముయతిగా ప్రతిపాదమునందుఁ గల నాల్గు పాదములు గలది. ఉదా:—

జ ర జ ర జ గ

U | U | U | U | U | U | U | U

విచార, సాగరం, బులోన, వీన ఘట్టముల్ ధ, రక్ష

౮. ఉత్సాహ:— ఏడు సూర్యగణములపై ఒకగురువు ప్రతిపాదమున నుండవలయును. అయిదవ గణము మొదటి యక్షరము యతిస్థానము, ప్రాస నాలుగు పాదములకు నుండవలయును. ఉదా:—

న గల న గల గల గల గల గ

| | | U | | | | U | U | U | U | U

తనయుఁ, గాచు, పనికిఁ, బూని, ధర్మ, పుత్ర, వాయు, నం

౯. ద్విపద:— మొదట మూఁడింద్రగణములు పిదప నొక సూర్యగణము నుండును. ప్రథమ తృతీయ గణముల

మొదటి యక్షరములకు యతిచెల్లును. రెండవపాదమునకు ఇదియే లక్షణము. రెండు పాదములకు ప్రాసముండును.

భ    సల    సల    న

U I I    I I U I    I I U I    I I I

ఉదా :— చెప్పెద, నొకమాట, చెవియొగ్గి, వినుము.
తప్పుగాచినమీఁదఁ దగ దెగ్గు లెన్న.

### ౨. జాతులు

గురులఘువులలో నెయ్యది ప్రథమ పాద ముఖమున నిల్చునో అదియే దక్కిన పాదములయం దుండవలయును. ఈ నియమముగలవి జాతులు.

కందపద్యము మొదలైనవి :— కందమునకుఁ బ్రథమ తృతీయ పాదములు మూఁడేసి గణములును, ద్వితీయ చతుర్థ పాదములు ఐదేసి గణములును నుండవలయును. గగము, భగణము, జగణము, సగణము, నలము ఈ గణములే యుండవలయును. ఆఱవ గణము నలముగాని, జగణముగాని యుండవలెను. బేసిగణములందు జగణ ముండరాదు. నాల్గవ గణము మొదటి యక్షరమునకు, నేడవ గణము మొదటి యక్షరమునకు యతిమైత్రి యుండవలయును. రెండు నాలుగు పాదముల చివర గురువు లుండవలయును. ప్రాస నాలుగు పాదములకు నుండవలెను.

ఉదా :— అకలుష/నిర్లిప్త గా క
   న్యకచమునకు నోటువడిన యవియై తేటుల్
   మకరందార్థము తఱచుగ
   వికచములగు పుష్పములకె వెదకుచు నేగున్.

## 3. ఉ ప జా తు లు

ఉపజాతులలో పాదప్రథమాక్షరములు గురులఘువులలో నేదైన నుండవచ్చును. ప్రాస యతిగలదు.

౧. తేటగీతి, ౨. ఆటవెలఁది, 3. సీసము

౧. తేటగీతి :— ప్రతిపాదమునకు మొదట నొక సూర్యగణము, పిమ్మట రెండింద్రగణములు, ఆపైని రెండు సూర్యగణములు నుండవలయును. ప్రథమ చతుర్థ గణములందు యతియేని ప్రాసయతియేని వాడవచ్చును.

ఉదా :— గల   త   సల   గల   గల
   ∪ |, ∪ ∪ |, | | ∪ |, ∪ |, ∪ |

   అమ్మ, హాపూజ, కొనసాగి, నట్టు, లైన
   మోక్ష, సామ్రాజ్య, మొనగూడు, నాకు, నంబ

౨. ఆటవెలఁది :— ప్రథమ, తృతీయ పాదములయందు మొదట మూఁడు సూర్యగణములు పిమ్మట రెండు ఇంద్రగణములును, ద్వితీయ చతుర్థ పాదములయం దైదేసి సూర్యగణములు నుండవలయును. ప్రతిపాదమునకు నాల్గవ గణమునందు యతియైన ప్రాసయతియైన నుండవలయును.

I I I   I I I   U I   U I I   I I U I

మొనసి, దనుజ, యోధ, ముఖ్యులు, నిగిడించు

శస్త్ర, సముద, యంబు, జ[redacted]

3. సీసము:—ఒక్కొక్క పాదమున కాటేంద్ర గణములు, రెండు సూర్యగణములునుండవలయును. ప్రథమ తృతీయగణములకును అయిదవ యేడవ గణములకును యతి గాని, ప్రాసయతిగాని యుండవలయును. ఇట్లు నాలుగు చరణములుండి యనంతరము తేటగీతిగాని, ఆటవెలఁదిగాని యుండవలెను. ఉదా:—

ర భ సల త ర త న గల

U I U ' U I I ' I I U I ' U U I ' U I U ' U U I ' I I I ' U

సత్యని, త్యుండవు, నతినింతి, వంచించి, దానివ, ప్రార్థంబు, దటిగి, నీకు

కొన్ని విశేషములు

౧. ఉత్పలమాలయొక్క పాదములందలి గణములలో మొదటి గురువును రెండు లఘువులుగా నొనర్చిన చంపకమాల గణములగును.

ఉదా:—ఉ॥ నావుడు వారలెల్లను ఘనంబగు పద్ధతి యుంచు మెచ్చఁగా.

చం॥ అనవుఁడు వారలెల్లను ఘనంబగు పద్ధతియుంచు మెచ్చఁగా.

౨. శార్దూలముయొక్క పాదములందలి మొదటి గురువును రెండు లఘువులుగా నొనర్చిన మత్తేభ గణములగును.

ఉదా:—శా॥ ఔరా మేటిపరాక్రమ క్రమము భావ్యంబౌనె శాంతంబురా.

మ॥ అవురా మేటిపరాక్రమ క్రమము భావ్యంబౌనె శాంతంబురా.

3. కందపద్యము గురువునకు రెండు లఘువులుగాఁ జేసి లెక్కించిన అరువదినాలుగు లఘువులుగా నుండును. నాలుగేసి లఘువుల నొక్కొక్క గణము క్రిందను లెక్కించిన గణము సులభముగాఁ దెలిసికొనవచ్చును.

## అలంకారములు

కావ్యములు:— అలంకార సహితములును, దోష రహితములు నగు వాక్యసముదాయముతో నొప్పునది కావ్యము.

కావ్యములు:—౧. పద్యకావ్యము, ౨. వచనకావ్యము అని రెండువిధములు.

౧. పద్యకావ్యము:— ఛందశ్శాస్త్రమునకు సంబంధించిన పద్యములతోడను, అందందు చిన్న చిన్న వచనముల తోడను వెలయునది.

ఉదా:—పారిజాతాపహరణము, విజయ విలాసము.

౨. వచనకావ్యము:-వచనముతోఁగూడి వెలయునది.

ఉదా:—వచనభారతము.

అలంకారము:—చమత్కార కారకములును రసో పస్కార కారకములును నగు శబ్దార్థములు అలంకారము లనఁబడును.

ఇది ౧. శబ్దాలంకారము ౨. అర్థాలంకారము అని రెండువిధములు.

౧. శబ్దాలంకారము (Word Rythym):—శబ్దముల యొక్క కూడికచే వినుటకుఁ జదువుటకును మనోహరమైనది. ఇది ౧. అనుప్రాసము, ౨. యమకము, 3. ముక్త పద గ్రస్తము మొదలైన భేదములుగలిగి యుండును.

౧. అనుప్రాసము:—మున్నుగొన్న వర్ణమునే పలుమాఱు వాడిన ననుప్రాస మేర్పడును.

ఉదా:—చరణానత శరణాగతభరణాతత కరుణాలయ

౨. యమకము:—వాడిన శబ్దమునే అర్థభేదముచే మఱల మఱల వాడిన యమక మేర్పడును.

ఉదా:—మముఁగని కరంబును గనికరంబున గరంబుఁ గరంబుఁ దట్టి యిట్లనియె.

3. ముక్తపద గ్రస్తము:—విడిచిన శబ్దభాగమును తిరిగి నుడివిన నేర్పడును.

ఉదా:—సుదతీ నూతనమదనా మదనాగ తురంగ.

అర్థాలంకారములు(Figures of Speech):—అర్థము ప్రధానమై కావ్యమునకు శోభ దెచ్చునవి:—

౧. ఉపమాలంకారము ౨. అనన్వయాలంకారము
౩. స్మరణాలంకారము ౪. రూపకాలంకారము
౫. ఉత్ప్రేక్షాలంకారము ౬. సందేహాలంకారము
౭. భ్రాంతిమదలంకారము ౮. విషమాలంకారము
౯. అతిశయోక్త్యలంకారము ౧౦. ఆక్షేపాలంకారము
౧౧. వ్యతిరేకాలంకారము ౧౨. సమాసోక్త్యలంకారము
౧౩. విరోధాభాసాలంకారము ౧౪. తుల్యయోగితాలంకారము
౧౫. దృష్టాంతాలంకారము ౧౬. అర్థాంతరన్యాసాలంకారము
౧౭. శ్లేషాలంకారము ౧౮. కావ్యలింగాలంకారము

మొదలైన భేదములతో నొప్పును.

౧ ఉపమాలంకారము (పూర్ణోపమ) (Simile):— రెండు పదార్థములయందు మనోహరమగు సామ్యము గలిగినచో నుపమాలంకార మగును:—

౧. ఉపమానము, ౨. ఉపమేయము, ౩. సాధారణ ధర్మము, ౪. ఉపమావాచకము అను నాల్గుభాగములు గలిగినచో పూర్ణోపమ యగును.

ఉదా:— ఈముఖము చంద్రునివలె మనోహరముగ నున్నది.

(౧) ఉపమానము:—చంద్రుడు

(౨) ఉపమేయము:—ముఖము

(౩) సాధారణ ధర్మము:—మనోహరము (ఉపమానోపమేయములకు సామాన్యగుణము)

(౪) ఉపమావాచకము:—పోలె, వలె, (పోలికను సూచించు వలె మొదలైనవి)

లుప్తోపమ:—ఉపమానోపమేయ సాధారణధర్మోపమా వాచకములలో నేదేని లోపించినచో లుప్తోపమ యగును.

ఉదా:—ముఖము చంద్రునివలె నున్నది.

౨. అనన్వయము:— ఉపమాన ఉపమేయత్వములు ఒక్కచోటనే యుండునటులఁ దెల్పుట.

ఉదా:—రామునకు రాముఁడే సాటి.

3. స్మరణము:-ఏదేని యొక వస్తువునుజూచి దానితో సమానమైన యిష్టవస్తువును స్మరించుట.

ఉదా:—శంపాలతతోడి నీలమేఘమును జూచి సత్యభామతోడి శ్రీకృష్ణునిఁ దలంచెను.

౪. రూపకము (Allegory):—ఉపమేయధర్మమును ఉపమానమునందు హృదయరంజకముగ నారోపించుట.

ఉదా:—ముఖచంద్రుఁడు దరహాస జ్యోత్స్నలను వెదజల్లుచున్నాఁడు.

౫. ఉత్ప్రేక్ష (Metaphor):-ఉపమేయమునకు నుండు నుపమాన ధర్మమునుబట్టి యుపమేయము నుపమానముగా భావించుట.

(వస్తువుగానిది వస్తువుగాను, హేతువుగానిది హేతువుగాను, ఫలముగానిది ఫలముగాను, తలఁపఁబడును.)

ఉదా:—హిమాలయము పూర్వ పశ్చిమ సముద్రములకుఁ గొలగఱ్ఱవలె వెలయుచున్నది.

ఇది ౧ స్వరూప ౨ హేతు 3 ఫలోత్ప్రేక్షలుగా నుండును.

(౧) స్వరూపోత్ప్రేక్షయందు ప్రకృతమే యప్రకృతముగఁ జెప్పఁబడును. (వస్తూత్ప్రేక్ష యనునది స్వరూపోత్ప్రేక్షకు నామాంతరము.)

ఉదా:—ఈచీఁకటిని చక్రవాకియొక్క విరహాగ్ని నుండి పుట్టిన పొగయని తలతును.

(౨) హేతూత్ప్రేక్ష:—హేతువుకాని దానిని హేతువుగ స్వీకరించుట.

ఉదా:-కమలినీ సంతాపముచేఁ జంద్రుఁడు క్షయించుచున్నాఁడు—

(3) ఫలోత్ప్రేక్ష:—ఫలముగాని దానిని ఫలముగాఁ దెల్పుట.

ఉదా:—తన రథముయొక్క వృద్ధాశ్వములను మార్చుటకా యేమి సూర్యుఁడు అశ్వజన్మస్థానమగు పడమటి దిక్కునకుఁ బోవుచున్నాఁడు.

౬. సందేహాలంకారము:—ఉపమేయమునందు ఉపమాన వస్తువుల సందేహము గలుగుట.

ఉదా:—ఇది చంద్రబింబమా! పద్మమా!

౭. భ్రాంతిమదలంకారము:—ఉపమేయమును జూడ నుపమాన భ్రమగల్గుట.

ఉదా :—నీయశస్సు ఎల్లెడల వ్యాపింపఁగా శ్రీహరి క్షీరసాగరమును, శ్రీకంఠుఁడు కైలాసమును, బ్రహ్మ హంస రాజమును వెదకుచున్నారు.

౮. విషమాలంకారము:—అసంగతార్థములకు సంఘటనము చెల్పుట.

ఉదా :—నక్క యెక్కడ - దేవలోక మెక్కడ.

౯. అతిశయోక్తి (Hyperbole):– వస్తువును ఉన్న దానికంటె హెచ్చుగాఁ జెప్పుట.

ఉదా :—ఆ మేడలు చుక్కల నంటుచున్నవి.

౧౦. ఆక్షేపము :—ఇతరుఁడు చేయు కార్యము నాక్షేపించి తన యభీష్టము నాటఁ జెప్పుట.

ఉదా :—ఓ ప్రాణనాయకా ! వదలి పోవుచున్నావు గదా ! నా జన్మము నీయుద్దేశ్యదేశంబున నే కలుగుఁగాక !

౧౧. వ్యతిరేకము :—ఉపమానముకంటె నుపమేయ మధికమని చెప్పుట.

ఉదా :—కువలయద్వేషము గోరనిచో నబ్జ బాంధవుఁడు నీ తేజమునకు సాటియగును.

౧౨. సమాసోక్తి :—ప్రకృతవస్తువుయొక్క విశేషణ సామ్యముచే నప్రకృతవస్తువు గమ్యమానమగుట.

ఉదా :—ప్రాచీముఖమును జంద్రుఁ డనురక్తుఁడై ముద్దుఁ గొనుచున్నాఁడు.

౧౩. విరోధాభాసము :—విరోధమగుపడునట్లు చెప్పి పిదప శ్లేషాదులచే నావిరోధనివారణము చెప్పుట.

ఉదా:-నీ కరము, ధర్మకరమయ్యు ప్రతిపక్షధర్మభేది.

౧౪. తుల్యయోగిత:—ప్రకృతములకుఁగాని, యప్రకృతములకుఁగాని తుల్యభావము ప్రకటితమగుచుండుట.

ఉదా :—రాజా! నీవు శత్రువులకు మిత్రులకు నరిష్టమిచ్చితివి.

౧౫. దృష్టాంతము :—ఉపమేయముతో ఉపమానమును బింబ, ప్రతిబింబ భావముచే దృష్టాంతీకరించుట, (ఇందు రెండు వాక్యము లుండును. బింబ ప్రతిబింబ భావమనఁగా సహజముగా భిన్నములైన వానిని సాదృశ్యముచే నభిన్నముగను వేర్వేఱుగను జెప్పుట.)

ఉదా :—గుణము తెలియకుండినను సుకవి వాక్యము కర్ణరసాయనముగ నుండును. పరిమళము నాఘ్రాణింపకుండినను మాలతీ కుసుమమాలిక నేత్రపర్వముగా నుండును.

౧౬. అర్థాంతరన్యాసము :—ఒక వాక్యార్థమును సమర్థించుటకై సామాన్యముగాఁగాని విశేషముగాఁగాని, మఱియొక వాక్యమును జెప్పుట.

ఉదా :—౧ రావణుఁడు సీత నపహరించి చెడిపోయెను. దుష్కృత్యము కీడును గలిగించునుగదా! ౨ వెల

లేని రతనముచే నొప్పు హిమవంతుని హిమము శోభాహాని చేయలేదు. ఒక దోషము గుణసముదాయమున మునిఁగి పోవును.

౧౭. శ్లేష:—ఒక్కపదముచే ననేకార్థములు ప్రతి పాదించుట.

ఉదా:—ఉన్నత తరులచే నొప్పుమీరుచు మంజు లతలచే మించు కొమ్మల కాకరంబగు నప్పురం బారామంబు కడు నొప్పుమీరు. అంధకక్షయకరుఁ డుమానాథుఁడు మమ్మునేలుఁగాక !

౧౮. కావ్యలింగము:— సార్థకమైన కారణవాక్యముచే కార్యము నిరూపించి చెప్పుట.

ఉదా:—ఓమన్మథజడుఁడా ! నావలనఁ బరాజయము నొందితివి. ఏమన నాచిత్తమున ముక్కంటి గలఁడుకాదె !

సమాప్తము